# ప్రకటన.



పరమహంస స్వరూపులగు శ్రీమాన్, వేంకటాద్రిస్వాములవారి విశేష మహిమలుగల ప్రభావములు యిప్పుడు సుమారు 22 సంవత్సరములకుమున్ను జరిగిన సంగతులేగాని బహుకాలములకుమున్ను జరిగిన సంగతులుగావు ఈ గ్రంథము ఇదివరకు 2 పర్యాయములు ముద్రించి విక్రయమైపోయినది 3-వ పర్యాయమున్ను ముద్రించి స్వతసిద్ధముగాయున్నది. శ్రీమాన్, వేంకటాద్రి స్వాములవారిచారిత్రము పుస్తకం ఒక టింటికి మిక్కిలి సులభక్రయము అణాలు (6) వంతున యివ్వబడును.

## వీరి శిష్యులగు.

పుష్పాలరామదాసుగారి సంకీర్తనలు మొదటిభాగముఅచ్చువేసి స్వతసిద్ధముగాయున్నది మిక్కిలి సులభక్రయము పుస్తకంఒకటింటికి అణాలు (6) వంతున యివ్వబడును. రకంఒకటింటికి 10 పుస్తకములుతీయువారలకు 1 పుస్తకమున్ను 100 పుస్తకములు మొత్తముగాతీయువారికి 15 పుస్తకములున్ను కమీషన్ యివ్వబడును.

పుస్తకములు కావలయువారికి వి. పి. పోష్టుద్వారాగా బంపబడును.

వారివారిపైవిలాసములు వివరముగా వ్రాయవలయును.

గ్రంథనిర్వాహకుల పైవిలాసక్రమంబు

☞ పుష్పాలరామదాసు.

నెంబరు - 70, తైయప్పమొదలివీధి, మద్రాసు.



శ్రీరామజయం.

# ప్రకటన పత్రిక.

శిబిచ్చక్రవర్తిచారిత్రము నందలిగల విషయసూచిక.

సకలజీవకారుణ్యహృదయులగు మహానుభావులగుశిబిచ్చక్రవర్తి ౫౬ దేశపురాజు లెల్లరలకున్ను మిక్కిలి మేటిగా తొల్లి అయోధ్యాపురిని పరిపాలింపుచుండిరట యీశిబిచ్చక్రవర్తికి తోచినదేమనిన యీపుడమీశు లెల్లరులకున్ను మనముమేటిగాయుండడంబిదియొకగౌరవేముగాదు-కష్టపడి ౧౦౦యాగములు జేసినట్లయితె దేవలోకమున కేతెంచవచ్చును దేవేంద్రుడెక్కినసింహాసనంబుపై గూర్చుకొని ఆయింద్రలోకమును యేలవచ్చును ముప్పైమూడుకోట్ల దేవతులు మనకులొగ్గి సేవలుసేయుదురు యిదిమిక్కిలి గౌరవముయని యోచించి ౯౯ యాగములుచేసి అయినది నూరవయాగము జేయుచుండగా త్రిలోకసంచారియగునారదులు శిబిచ్చక్రవర్తివద్దికేతెంచిరట. అప్పుడు-అయోధ్యానగరంబుయేదిక్కు-జూచినాగానిపచ్చనీపందిళ్లుమగడదోరణములుకాహళభేరులుఘనవాద్యంబులుబిరుదుకొళ్లుమద- గజతురగంబులుగొప్పచామరాల్ గొడుగులుమొదలుగ భేరిదుందుభ్భులు బోరునమ్రోయగ దివిటిమత్తాబులుదిశలువెలుగగా నదరగదిక్కులు నదుర్ వేట్లతో నా- కాశమఠయ నా-కాశబాణముల్ చిత్రవిచిత్రనక్షత్రబాణముల్ కన్నుమేరకును కనుబడుచుండెడి వెన్న

మద్దబాణముల్ వేల్వేలుగ విడుచుచు బురుసులు విధవిధములుగా పొదలగా. ణంబులు త్సదలనంటుచు బుసలుగొట్టుచు దిశలు బెదరగా మొగిశెను క్రోట్లకు మెకుృ-వలగుచు-పొగగప్పెను భూమండలమంతయు బ్రాహ్మణజనములు బారుదీరగా నారదులుజూచి సంతసించి శిబిశ్చక్రవర్తితో సంబాషించివారిఅభిప్రాయమును తెలుసుకొని తక్షణం యింద్రలోకమునకే తెంచి-దేవేంద్రా శిబిశ్చక్రవర్తి జేయునట్టి నూరవయాగమును యేవిధముననైనా తాము భిన్నపరచినట్లయితే నీకుభయములేదు భిన్నపరత్సనిపక్షమునకు యీ యింద్రపదవి తమకు దక్కదని కలహముబెట్టి నారదులు యేతెంచిరట యీవార్తను దేవేంద్రుండు విని బెదరుచు గుండెల్లదురుచు కాళ్లుచేతులుగడగడవణుకుచు మిక్కిలి భీతిజెందిఅగ్నిహోత్రునిబిలిచి-కపోతమను పక్షిరూపమునునీవుమెత్తి శిబిశ్చక్రవర్తివద్దికే తెంచిఅభయంబభయంబని-శరణుజెందుము అతనునిన్నాదరించుచుపక్షిరాజను డేగరూపమును ధరియించి నేనునిన్నుతరుముకొనివచ్చినట్లుగా వచ్చెదనుయేవిధముననైనావారుజేయుయాగమునుమనముభిన్నపరత్సవలయునని మాట్లాడుకొని శిబిశ్చక్రవర్తి సముఖంబున అతిదీనభావముగా అభయంబభయంబని శరణుజొచ్చిన పావురమును చేరదీసి భయపడకుమని అభయదానంబిచ్చి మిక్కిలి ఆదరింపుచుండగా దేవేంద్రుండు డేగరూపంబుదాల్చి వచ్చి శిబిశ్చక్రవర్తినిజూచి (శేనాఃకపోతాః ఖాదయంతి।)యనినట్లుగా, నాకు ఆహారమయ్యేడు పావురమిది నేనుమిక్కిలి ఆకలిచేవాడివచ్చి యున్నాను నా యాకలిని దీర్చుమా! యీపావురమునన్ను త్సాలాశ్రమపరచినది నాపాలబడిన పావురమిదబక్షింత్సవలయును నాసొత్తు నాకిమ్మాయనియడుగగా నే నివ్వనేయివ్వననెనట నాకాహారమగుపావురమును యివ్వనే యివ్వ ననడము యిదిరాజధర్మమా రాజపాడిగాదు యనిరాజుతో తగువు పెట్టుకున్నదట. రాజుగారూపావురముతప్ప మరియేదియడిగినాగాని యిప్పించెదనని వాక్దానంబివ్వగా మంచిది నేను మాంసబక్షకుడనుగాన ఈపావురమును తుల నిడిదీనెత్తునీ దేహమాంసమిప్పింత్సమనిన చక్రవర్తి మంచిదనిసమ్మతించిబాగతులయును సక్కడ పక్షినుంచి కరుకుగల కత్తులతో తనదేహమునందుగలమాంసమంతయు గోరంతయును లేక కండంతుండసముగా చెక్కలు చెక్కలుగా

కోసి శ్రీత్రాసునకిడిన అతిధీవులగు శిబిచక్రవర్తి చారిత్రము బహుభక్తిరసము గా తోహరాలుగానున్ను కథను అనుసరించిన కీర్తనలుగానున్ను కందములు సీసములు సీసమాలికలు. చంపకములు మత్తేభములు మత్తకోకిలలు శార్దూలపద్యములుగానున్నచాలీలుగానున్ను బహుభక్తి రసముగా నమరియున్నది శ్రీహరికథా కాలక్షేప పరులకుత్సాలా అనుకూలము పండిత పామర బాలవృద్ధులున్ను బాలికలుస్త్రీలున్ను యీపుణ్యకథను దీసి చదివి చూడబూడ మనస్సుకు యెంతో ఆహ్లాదంబగున్ను మిక్కిలి సులభక్రయము పుస్తకంబొకటింటికి అణాలు ౪ వంతున యివ్వబడును.

శ్రీచంద్రభాగా నదీతీరనివాసియగు శ్రీరాధారుక్మిణీ నాథుండగు శ్రీ పాండురంగవిఠల్ నాధునివిషయముగా మిక్కిలిభక్తిలి రసముగా శార్దూలవృత్తములుగా నమరియుండగల పుష్పాలరామప్రభు శతకం బొకటింటికి సులభక్రయము అణాలు ౨ వంతునయివ్వబడును.

పెండ్లిసమయంబున బాలికలు స్త్రీలు పాడుటకు పెండ్లికొడుకుమైన పెండ్లికూతురుమైన శృంగారంబైన యెగతాళిపాటలపుస్తకం బొకటింటికి అణా ౧ వంతున యివ్వబడును. యిదిగాక.

భక్తజనులకున్ను బాలురకున్ను బాలికలకున్ను స్త్రీలకున్ను మిక్కిలి సులభశైలిగాపఠియించుటకు కందపద్యములు పుష్పాలరామస్తవంబనుపుస్తకంబొకటింటికి క్రయము అణా ౧ పైలు ౩ వంతున యివ్వబడును.

అఖండభక్తిజ్ఞాన సంపన్నురాలగు సక్కుబాయమ్మగారిచారిత్రము పండిత పామర బాలవృద్ధులకున్న బాలురు బాలికలు స్త్రీలకున్ను మిక్కిలి సులభశైలిగా శార్దూలవృత్తములుగా అతిమాధుర్యముగా భక్తిరసముగా నమరియుండగల చారిత్రం బొకటింటికి మిక్కిలిసులభక్రయము అణాలు ౪ వంతున యివ్వబడును.

ఈఅయిదురకములున్న ౧౦ పుస్తకములుతీయువారలకు ౧ పుస్తకం కమీషన్ యివ్వబడును మొత్తముగా ౧౦౦ పుస్తకములు తీయువారలకు ౨౦ పుస్తకములు కమీషన్ యివ్వబడును.

గ్రంధనిర్వాహకుల పైవిలాసక్రమంబు,

[illegible]. పుష్పాల రామదాసు.

తైయప్పమొదలివీధి ౭౦ నెంబరు మద్రాసు.



శ్రీరామజయం.

# విషయానుక్రమసూచిక.

విషయానుక్రమసూచిక.

సంపూర్ణం.

# ప్రకటన.

ఇందువలన సమస్తమైన భక్తులకు తెలియచేయడం యేమనిన.

పరమహంస స్వరూపులగు శ్రీమాన్ వేంకటాద్రి స్వాములవారున్ను వీరిశిష్యులగు పుష్పాలరామదాసుగారున్ను వీరుయిరువురులుఒకటిగాచేర్చి ఎత్తిరకాపినెట్టుసైజు పుటంగ్రాపు అతిక సులభక్రయము పఠము ౧కి, అణాలు ౪. ౧౨ పఠములు మొత్తముగా కొనువార్లకు రూ ౨- ౮- ౦.

పుష్పాలరామదాసుగార్ని తనిగా కాపినెట్టుసైజు పుటంగ్రాపుకావలయువార్లకు పఠము ఒకటింటికి అణాలు ౩. ౧౨పఠములు మొత్తమునాకొనువారికి రూ- ౨- ౨- ౦.

పుష్పాలరామదాసుగారు శ్రీహరికథ కాలక్షేపగోష్ఠి సహితముగా యెత్తియుండగల ౧౨—౧౦ ఇంచి సైజు మిక్కిలి భారీపఠము ఒకటింటికి క్రయం అణాలు ౧౨. మొత్తముగా ౧౨ పఠములు కోరువార్లకు రూ- ౯- ౦- ౦.

ఈ పఠములు వి. పి. పోస్టుద్వారాగా పంపబడును.

కావలివారి షైవిలాసములు వివరముగా వ్రాయకోరెదను.

## ఆ. జా. కృష్ణరాజు.

ఆర్ టిస్టు పొటంగ్రాపు మలయపెరుమాళ్లువీధి ౯౩ నెం. మద్రాసు.

వెలసులభము. # ప్రకటన. ఫలమధికము.

## శ్రీమాన్ - వేంకటాద్రిస్వాములవారి వైభవ విషయసూచిక.

☞ ఓ పరమభక్తశిరోమణులారా! యిందునగల సంగతులను పలుమారు శ్రద్ధగా చదివి తప్పక గ్రహించి తమతమ ప్రియులకున్ను దెలుపవేడెదను.

ఇందువలన భగవద్భక్తశిరోమణులందరికిని దెలియునేమనఁగా మనిన కలియుగప్రహ్లాదులని ప్రపన్నగోష్ఠిచే కొనియాడంబడిన మహానుభావులును శ్రీపరమహంస స్వరూపులునగు, శ్రీమాన్ - వేంకటాద్రిస్వాములను పేర ప్రసిద్ధికెక్కిన పరమభక్తశిఖామణిచరిత్ర మత్యద్భుతంబుగాను మధురముగానుండును. మిక్కిలి అపార మహిమలుగల యీ దివ్యచారిత్రమునున్ను దాసుడు కాలక్షేపము చేయుదును.

చెన్నపురంబున నున్న సకలరు పండిత పామర బాలవృద్ధులు వేంకటాద్రి స్వాముల వైభవంబులు యెరిగియుందురు. అయినను ఈ గ్రంథమును దీసి చదివి చూడ జూడ మనంబున కత్యాహ్లాద కరముగాయుండును.

శ్రియఃపతియై, శ్రీవైకుంఠ నికేతనుండై, ఉభయవిభూతి నాయకుండై, పరమపదంబున [illegible] భూ, నీళా, సమేతుండై, నిత్యసూరులవలన సేవ్యమానుండగుయుండు శ్రీమన్నారాయణు [illegible], కల్యాంతాంతరంగవిస్తులకును, పరమభాగవతో[illegible]లు కచేయు [illegible] శ్రీపుండరీకాక్షగ[illegible]లగు పరమహంస శ్రీమాన్ వేంకటాద్రి[illegible]స్వాములని, ప్రపన్నగోష్ఠిచే పొగడొందిన [illegible] తిరువేంగడ రామానుజజియ్యంగారి [illegible] చరిత్రంబు [illegible] వైరాగ్యవైభవంబును, అతి[illegible]ల్యంబున, అయిదారేండ్ల [illegible] భక్తి కలుగుటయును [illegible] పరమభాగవతోత్తముని [illegible], తూము, నరసింహ[illegible]వా శ్రీతెంచుటయు వారిచే తంబూర, గజ్జెలు, కరతాళంబులును, బడయుటయును, [illegible] దంబు, లక్ష్మి మొనపి[illegible], భద్రాచలంబున కేగుటయు, రామభక్తుని, నేమనంబున, శ్రీరామకోటి, లిఖించుటయును, తత్పూర్వపరంబునంగల, బ్రాహ్మణ, సమాజంబులకు, [illegible] ణల, [illegible] యును, [illegible]వల, అప్పరిసవిడిచి, [illegible] చీపగరంబు ప్రవేశించుటయు, గరుడోత్సవదర్శన కుతూహలులగుటయును, శివరఁపరాంపెరుమాళ్లకు శ్రీపెరుంబేపతె యార్లకు శాశ్వితపుష్పకైంకర్యవనములు రెంటిని గలుగజేయుటయును, తద్వనంబున సర్ప[illegible]ష్టంబగుటయును తద్విషంబు భగవంతుని తులసీతీర్థంబులచే విమోచనంబగుటయును, శాశ్విత చందన కైంకర్యంబు జేయుటయును ఆచంద్రార్కముగా వేదపాఠశాలలు యుంచుటయును, దీపప్రకాశుల, దివ్యస్థళజీర్ణోద్ధారణ జేయుటయును తత్సన్నిధి ఆరాధనాదిక్రియలకు మామూరుయస్సుగ్రామంబుదీసి విక్షపించుటయును, సామాన్యవిప్ర[illegible]రితంబై వేశ్యయొకతె వేంకటాద్రిస్వాములకడకేగి వారిమనంబుశోధింప వారు నిరాకరించుటయును, యిలగలకాలము ప్రతిద్వాదశిని శ్రీవయిష్ణవులకు తదియారాధన జరుగునటుల జేయుటయును సాక్షాత్

సర్వేశ్వరుని శయ్యాగృహంబునకు చిక్కని పాలము నున్న పరిమళంబులుగల విడెము
మొదలగుభోగ్యంబుల శాశ్వతంబుగా జరుగునటుల జేయుటయు, తదనంతరము, తిరుక్క
చ్చినగరంబునంగల సకలదివ్యస్థల జీర్ణోద్ధారణంబులు సేయుటయు, పిదప భక్తులరో
జాకుపది రావ్యంబులు చేరునంతవరకును జలపానాదులు చేయక వైరాగ్యంబు జేయుట
యును, శ్రీదేవరాజస్వాములకు దివ్యరత్న మయంబగు వైరముడి జేయించుటయు, ఉభ
యనాచ్చిమార్లకు నవరత్నకిరీటములు రెంటిని సమర్పించుటయును కాంచీనగరంబు నుంగల
దివ్యదేశంబులజీర్ణోద్ధారణ జేయించుటయును హస్తిగిరీశుని అనుమతంబున సమాశ్రయణసం
పన్నులగుటయును నారేయి పన్నగశయనుడు పరిమద్దియాళుడు పదియాళ్వారులచే పాడ
బడిన పావనమూర్తులైన శ్రీరంగనాథుడు, స్వప్నసాక్షాత్కారుడై పాండియన్ కొండె
యను దివ్యకిరీటము జేయుమని నియమించుటయును, సదరు కిరీట మొనర్ప నాస్వా
మికి సరిజాడబోవ మార్గంబున లాల్గుడియూరిని చాలరేత్రిలో చోరోపద్రవంబు గల్గు
టయును తత్సమయంబున శ్రీరంగనాథుడు జమీన్దారుల పగిదినేతెంచి చోరుల యు
పద్రవము బాపుటయు ఇదిగాక మార్గమధ్యంబున క్షుత్పిపాసులచే భక్తులు శ్రమబడుట
జూచి సర్వేశ్వరుండు అగ్రహారంబొకటి కల్పించి తద్భక్తులకు సన్నభిక్షనొసంగుటయును
సర్వశరణ్యుని సన్నిధిని జేరి భగవంతుని శిరంబున నొప్పుచునిడ నది సరిపడియుండ సక
లము సంతోషించుటయు ఆవల చన్నపురంబునకుం జేరి తత్కైంకర్య పూర్తికై తిరుగుట
యు పాండియన్ కొండెయను తత్ కైంకర్యంబునుం బూనిజేయు తరి మరకతంబు జి
క్కన వైభవంబును, నామరకతమును కంసాలవాడు మోసబుచ్చుటయును తత్క్షణమే భగ
వంతుడు భక్తుని కరుకి జేయించుటయును, యాకిరీటంబు పనులుదీర్చియతి వైభవంబుగా
పురప్రదక్షిణంబు జేయించుటయును మధూకరంబునకుం వెళ్ళి బ్రహ్మరాక్షసిం ద్రోలుటయు,
దినకట్టనిర్ణయద్రవ్యంబు దొరకమిచే భక్తులుయొంపయుందు దరుగులావ శ్రీరంగేశుడు
అప్పాస్వామిరాజు అను మహాత్ముని వలె వచ్చి గొడుగుబట్టుటయు, యాదిననిబంధన
పైకము-పూర్తియగునంతవరకు వెంబడించి తిరుగుటయును, కిరీటంబు వూరేగించుటయును సహ
జనులతోడం గూడి, శ్రీరంగక్షేత్రంబునం జేరి యనంతవిభవంబులతోడ శ్రీరంగనాథునికి
కిరీటంబు సమర్పించి కుతూహలులగుటయు, పిదప నుభయనాచ్చిమార్లకు నవరత్నకిరీట
ములు రెంటిని జేసి నూరేగించి సమర్పించి సంతోషించుటయు ఉత్తరపినాకి నొడ్డున
నుండెడు నెల్లూరి శ్రీరంగనాయకులవారిసన్నిధిని జీర్ణోద్ధారణంబు జేయించుటయు, తిరు
పషందెయను, దివ్యస్థళజీర్ణోద్ధారణంబు జేయించియు, మహాబలిపురసన్నిధి ఖిలంబులుం
జక్కజేయుటయు, పెరియపెరుమాళ్లకు శ్రీరంగధామునకు యఱువదివేలకు యార్జించి
ద్రవ్యము మంచి పచ్చలు రవలు రత్నంబులు పొదుగజేసి మకరకంఠిని పూర్తిజేయుతరి
జరిగిన యాశ్చర్యంబులుం గొన్నియును తమశిష్యశిరోమణియను మహాత్ములా మాంబళ
నివాసియగు పయిడిగంట ఆదినారాయణదాసు గారికి అతిప్రీతితో తన దేవతార్చన
నొసంగుటయును మకరకంఠియను తద్దివ్యాభరణము శ్రీరంగనాథునికి సులగ్నం

బున సమర్పించి సేవించి భక్తులు యీనంద్ధినిమునింగి జేయుటయు శ్రీశాంబయిరాగి
వృత్తాంతంబును యీమహాత్ములు శ్రీరంగేశుకు శాశ్వతంబుగ తిరుమాల్ పద యతిర
సంబులు నారగించుటకై ౫౪ వేలరూపాయలుకు తిరుపళ్ళాగుకై యనుగ్రామంబు విక్ర
యమునకుదీసి విడిపించుటయు. యెండ గాలి, వానల కష్టములు, సైరింపక తిరిగి.
తిరిగి ధనమార్జించి రువ్వొమొదలుగా యనేకలక్షల రూప్యంబులు పోగుజేయుటయు
అపార కైంకర్యములును శాయము-నాయుపు కడలకముడపే ఈమహాత్ములు దివ్యదేశ
యాత్రాగమనంబును తదనంతిరము, తిరుమాలిరుంశోలై జీర్ణోద్ధారణంబు జేయించుట
యు, వైరాగ్యశీలులై యతియాశ్రమం బాశ్రయించుటయు లోకమాతయగు శ్రీరంగ
నాయకిమ్మకు రాజముడిజేసి సమర్పించుటయు ఇంకను గొప్ప శాశ్వతకైంకర్యంబులుం
జేయుటయు, వీరికి శ్రీరంగనాయకులు సట్టురవణ్ణప్రసాదంబిప్పించుమని సన్నిధియధికారు
లకు నియమించుటయు తత్ప్రసాదమిప్పించక నిద్ర జెందినబ్రాహ్మణుండు భగవంతుని చేబెత్తె
న్రశమయును, తదనంతిరము శ్రీరంగనాయకి భక్తులకు స్వప్న సాక్షాత్కారంబై రాజ
ముడి జేయుమనుటయు భక్తులు తద్వృత్తాంతంబు నచ్చటి యధికారాచులకు యెఱుక
జేసి యాచించి ఒప్పుచ్చు జేయించుటయు అట్టిసమయంబున గోకుల బృందావనంబున
నుండి రంగాచార్యులు రాధాకృష్ణులు శ్రీరంగనాధుని సేవార్ధులై యేతెంచుటయు
భక్తులు ఈకైంకర్య వృత్తాంతమును శ్రీమాన్ రంగాచార్యులసన్నిధని నెఱుకజేసి ఒప్పు
చ్చు ఇప్పించి కైంకర్యంబు పూర్తిజేయుమని ప్రార్థించుటయు రంగాచార్యులవారు ధ
న్యోస్మియని అంగీకరించి రాధాకృష్ణులచేతి కిప్పించుటయు అఖిలాండనాయకుండగు
శశ్వశగరు భక్తులస్వప్నంబున యేతెంచి విమానకైంకర్యంబొప్పుకొనుమనుటయు భక్తులు
భగవదాజ్ఞానుసారముగ తత్కైంకర్యంబు నెరవేర్చి శ్రీరంగస్థళంబునుంజేరి సన్యసింపంగోరి
తంబూర గజ్జెలు కరతాళాములను తమప్రియశిష్యులగు దేవేంద్రపురం నారా
యణదాసుచేతికిప్పించి మన దాసగోష్టులందరున్ను భగవద్గుణానుభవంబుచేయు
చుండుండని నియమించి తాము శ్రీమాన్, శ్రీరఙ్గనారాయణ జియ్యంగారి సన్నిధిని జేరి
సన్యసించి శ్రీతిరువేంకట రామానుజ జియ్యరను దివ్య తిరునామంబు వహయించుటయు
లోకమాతయగు శ్రీరంగనాయకమ్మకు ఆచంద్రార్క పరియంతము సట్టురవణ ప్రసాదంబు
నారగించునటుల ఏర్పాటుచేయుటయు పిదప కొన్నిదినంబులకు దేహజాడ్యంబొందుము
టయు రాజముడి నిమిత్తమై ఆరయ్యన్నచే పురోహితున్రవాసి బృందావనంబునకుం బంపుటయు
తత్పురోహితుచేకొని అచ్చటివారలు కైంకర్యముపూర్తిజేయించి రాజముడిని బృందావ
నంబున వూరేగించి బంపుటయు షోడశోపచారంబులుజేసి వచ్చినరాజముడిని లోక
మాతయ శ్రీరంగనాయకమ్మకు శులగ్నంబున ధరియించి శేవించి ఆనందాబ్ధినమునింగి దేలు
టయు భక్తులు శ్రీరంగస్థలనివాసులై శ్రీరంగనాధుని శయ్యాగృహంబునకు పరిమళంబు
లుగల చందనము భక్తిభలముచేదీసి భగవంతునికి సమర్పించుటయు ఈమహాత్ములకు పర

మదళ, ప్రోక్తంబగుటయు తమ నిర్యాణ కాలమును అణ్ణన్ మొదలగువారి కెఱుక జేసి తన్ను కనిపెట్టి యుండుమనుటయు పరమపదప్రాప్తి ప్రభావమును ధాతువత్సర కుంభ మాస బహుళ పక్షమున సోమవాసరంబున నర్ధరాత్రంబున శ్రీరంగనాథుండా[illegible]మయంబున నారగించిన సద్భరవణసాదంబు ననుప అది నారగించి శిష్యులంబ శిరః కపాలంబు భేదించి యర్చిరాది మార్గగాముండై తిరునాడలంకరించె చరమవిగ్రహంబును సన్నిధి మర్యాద లచే శ్రీయాళవందార్ పడిత్తురైయను భూమిని తిరుప్పళ్ళిజేస్పుటయు తిరువధ్యయన యుత్సవమై దివంబుమగల శ్రీతిరువేంకట రామానుజ జియ్యంగారి దివ్యావతార చరిత్రంబును చదివి జూడజూడ మనంబున కత్యాహ్లాదకరముగా యుండును.

ఇదిగాక నానాదిక్కుదిక్కులలో యుండగల ఘన సిపాయిలున్ను యితరదేశసంచారులగు అఖిలభక్తజనులున్ను యెంతో ఆహ్లాదముగా, పుష్పాల రామదాసుగారిచే శ్రీరాధారుక్మిణీనాథుండగు శ్రీచంద్రభాగానదీ తీరనివాసి యగు తొల్లి యుఖండ భక్తి జ్ఞానసంపన్నులగు యనేక భక్తకోట్లనుప్రోచిన శ్రీపాండురంగ విఠల్ నాథుని విషయముగా పరిపరి విధములుగా నతిమృదుమధురమైన జావళివర్ణమట్టుకీర్తనలు ఇంద్రసభవర్ణమట్టుకీర్తనలు శ్రీరాముల విషయమైన సంకీర్తనలు శ్రీరంగనాయకుల విషయమైన సంకీర్తనలు శ్రీకృష్ణపరమాత్ముని లీలావిషయమైన సంకీర్తనలు నాయకీనాయకాభావ సంకీర్తనలు మిక్కిలి మాధుర్యమైన శార్దూలవృత్తములు చంపకములు మత్తేభములు మత్తకోలలు పరిపరివిధములుగా నతిమృదుమధురముగాను మిక్కిలి భక్తిరసమైన సంకీర్తనలకు ముందు నొక్కొక పద్యముచొప్పున విశేషముగా వ్రాయబడి యున్నది ఈ ప్రకటనయందు మిక్కిలి బాహుళ్యముగా సంగతులు వ్రాయుటకు కూడనుగాన అతి సంగ్రహముగా వ్రాయబడినది. యిదిగాక పరమహంస స్వరూపులగు శ్రీమాన్, వేం[illegible]స్వాములవారి విశేష మహిమలుగల ప్రభావములు యిప్పుడు సుమారు 22 సం[illegible]లకున్ను జరిగిన సంగతులేగాని పూర్వకాలములకున్ను జరిగిన సంగతు[illegible] గ్రంథము ఇదివరకు 2 పర్యాయములు ముద్రించి విక్రయమైపోయినది 3-వ పర్యాయము యిప్పుడు ముద్రించి సిద్ధముగా యున్నది. శ్రీమాన్, వేంకటాద్రి స్వాములవారి చరిత్రము పుస్తకం ఒకటింటికి మిక్కిలి సులభక్రయము అణాలు (8) వంతున యివ్వబడును.

పుష్పాలరామదాసుగారి సంకీర్తనలు మొదటిభాగముఅచ్చువేసి సిద్ధముగా యున్నది మిక్కిలి సులభక్రయము పుస్తకంబొకటిటికి అణాలు (6) వంతున యివ్వబడును. రకంవొకటింటికి 10 పుస్తకములుతీయువారలకు 1 పుస్తకమున్ను 100 పుస్తకములు మొత్తముగాతీయువారికి 15 పుస్తకములున్ను కమీషన్ యివ్వబడును.

పుస్తకములు కావలయువారికి వి. పి. పోస్టుద్వారాగా బంపబడును.

వారివారిపైవిలాసములు వివరముగా వ్రాయవలయును.

గ్రంథనిర్వాహకుల పైవిలాసక్రమంబు

పుష్పాల రామదాసు.

నెంబరు - 70, తైయప్ప మొదలివీధి, మద్రాసు.

10. పరిధావి ద్వాదశి చక్కగా పుష్యమి నక్షత్రాన బహు జనులు మెచ్చ
11. లగ్నంబు తులయు దివిలక్షణంబుగ శుక్ర వాసరంబున నితడు జన్మమబుట్టె
12. బాల్యంబునుండియు పద్మనాభునియందు భక్తి జనించెను బాగుగాను
13. వరగుణశీలుడు వానమామల జియ్యరాచార్యుడాయెడ నమరగాను
14. భక్తివైరాగ్యముల్ లెస్సగబోధించ వేంకటాద్రిస్వామి వేదవేత్త
15. పరమహంసుడు చాల పరమ భాగవతుండు కారణగురుడాయె కరుణతోడ
16. నాగురు నాథుని యాజ్ఞను వర్తించి గురుప్రసాదంబున గుణగురుగాను
17. గుమ్మడైన భక్తులు మదురుట కరువాని గణనసైనట్టియా కథలు కృతులు
18. రచియించి ప్రజలను రాగవిముక్తుల జేయనుద్యోగించె చెల్వుమెరయ
19. వేంకటాద్రిస్వామి వేద్యుని చరితంబు కృష్ణాదుల నుతించు-కీర్తనలును
20 పుష్పాలరాముల పుణ్యాస్తవంబును పెళ్లిపాటలు జెప్పె పేర్మితోడ
21. శివకవిపద్ధతి చెప్పెనతో వారాలు కీర్తనల్ పద్యముల్ భక్తితోడ
22. కాలక్షేపము జేయు ఘనుల మనస్సున కానందంబు గల్గను శాంతితోడ
23. ఇదివరకీకథ యిలలోజూడగలేదు యాశ్వయుకృపచే యా దేర్చమిగుల
24. సత్కథాయిచరిత్ర శాస్త్రములుగాను సంక్షేపంబుగ జెప్పె సర్వుల్ మెచ్చ
25. నీదాసుకృతులన్ని యిలనెల్లచోట్లను వ్యాపింప దనపేరు ప్రసిద్ధికెక్క
26. పుణ్యదేశములందు పూనికైంకర్యముల్ బాగుగా జేసెను ప్రజలుమెచ్చ
27. నరసింహస్వామీపముల్ యాండాళు మరిపెరి యాళ్వారులనుసల్పె నాలయముల
28. భక్తకోటులు రామ భజన జేయుచు గుమి గూడియుండిన దాసకూటమును
29. భక్తశిరోమణి భవ్యపరాంకుశ దాసుల ముందట దాసప్రీతి
30. నాగురువర వేంకటాద్రిస్వాములు వీరి యందుపూర్ణానుగ్రహంబు బెట్టి
31. గజ్జెలు తాళముల్ ఘనతంబురుప్రసన్న వేంకటేశులయెదుట వేడుకలర
32. వేంకటాద్రిస్వామి వేమరుమంగళా శాసనంబులతోనీ దాసుజూచి
33 రహీమించు పుష్పాల రామదాసా కొను మనియిచ్చె చిత్రమా నంద మలర
34. తిగ చెన్న పురియందు దావిన్నైగోని దాసులు భక్తులు ధాత్రిజనులు
35. ముదమొందహరికథల్ మొనసిజేయుచుకీర్తి జగతిలోగాంచెనుచాలగాను
36. యీ దాసుపుణ్యంబు లేమనివర్ణింతు నలివింత వినుటకు నద్భుతంబు
37. ప్రభవాదు లరువది శుభవత్సరములలో యిరువదైదవదన ధరణి వెలయు
38. ఖరవత్సరంబున వరము ముత్తూ డోకండు సిద్ధరూపుండువి శిష్టవరయ
39. సప్తమా సిద్ధులు నరచేతి యామిరిక యశజాలునట్టి యా ర్యుండుధీరు
40. నాజానుబాహుండు నలినసుందరాంగుండుపీతాంబరధరుండు ప్రియముఖుండు
41. శిఖయునుగడ్డంబు చెలగ మేలిమియైన బంగారుమైకాంతి బరగువాడు

42. పట్టెనామంబులు పండ్రెండును ధరించి తులసీ మాలికలతో వెలయు సిద్ధ
43. పురుషుండు గుడిలోనై వసరాగ నీదాసు డపుడొక కార్యార్థ మచటికేగి
44. సాయంక్రమమ్మున శాంతిమూర్తియును బహు భక్తివైరాగ్యసంపన్నుడయిన
45. వేంకటాద్రిస్వామి కీర్తనచరితంబు నీదాసు చదువనీక్షించితాను
46. భక్తుడితండని బాగుగామదినెంచి చెంతకేతెంచి యాశిష్యుచేతి
47. పాత్రంబు వశీగదా బూనిగైకొని చూచి చదివియానందించి చాలమెచ్చి
48. వేంకటాద్రిస్వామి వేసకేత్తుసి పటము కండ్లకౌత్సుక బహు కనికరమున
49 వైష్ణవభక్తుండవు వరగుణమయుండు నీవాటచేసట నిలిచి నాడ
50. యనికొంతసేపు మాటలు నాడిసిద్ధుండు రయమున నితనితో రామదాస
51. నాప్రాయమేమందు నయగుణనీవగు వయసును నాకెరిగింపు వాస్తవముగ
52. యని సిద్ధుడడుగంగ విని మోదమందుచు జన్మ వత్సరమును జ్ఞప్తిజేసి
53. దాసుండు తనకాయు తగనేబదియయ్యెదుయారెనుతమదాయువాయనెంత
54. యనియనుగ సిద్ధుండు యానందభరితుడై దాసునీక్షించి యో ధన్యయనుచు
55. నుడివెముప్పది యైదు నూరులు మరినేబదైదేండ్లునా కాయము వాయె నిపుడు
56. అనిచెప్పగావిని యత్యద్భుతంబంది సిద్ధుని కరముల చేత బట్టి
57. చూడగా నవియున్న జాడ గన్పట్టిన దాసుడు దేహంబు దాను మఱచి
58. యూరేది యునికేమి యుపయుక్తభాషేది యనిసిద్ధునడుగగా ననియెనతడు
59. ఈవూరు నావూరు ఏబాస లాభాష లన నేల భాషలు నన్నిమాకు
60. చదువను వ్రాయను సరసంబుగను మాటలాడను భూమియు నంతరిక్ష
61. ములయందు రాకపోకలు చేయుచుందుము ఇప్పుడీ పట్టణ మింపుగాను
62. జూచిపోదామని సుజన సమాజపు వారితో నేతెంచినార మిటకు
63. వచ్చినందుకు భక్తవరజన రత్నమా నిన్నుజూచితిని నా కన్నులార
64. నిటవచ్చి ప్రొద్దాయె నికనేగవలె నాదు రాకకైమావారు శోకతోడ
65. మంత్రోసు నిలిపిన మైదానమందున నుందురు నేగెద నుందు మీవు
66. యనిచెప్పగా దాసు డతిదుఃఖమును జెంది కాళ్లపైబడి భక్తి కరము మోడ్చి
67. నన్నుమీవెంబడిన యగుణ కొనిపొమ్మటంచు వేడిన దాసు నార్తిజూచి
68. సిద్ధుండు నవ్వుచు చింతించి యొకకొంత సంసారిమాతోడ జనగరాదు
69. సంగ విముక్తులు సాధుసజ్జనములు మావెంటరావగు మాటి కిలను
70. యనిజెప్పగా దాసు వినిమిముజూచుట మరియెన్నడో యన మాన్యుడపుడు
71. సన్మీలనయనుడై క్షణమ్ముండి యిద్దాసు నీక్షించి వినుమని యిట్టులనియె
72. నికకొంత కాలంబు నమమన మిద్దరు గూడుప మీలాగు మూర్తితోడ
73. యనిదాసుతనచేతు లనుయూఁక దీపుక చనుచుంప నీదాసు చాలమదిని

74. చింత నొందుచు వెంట చేర జనంగను కొంతమారంబునకు కోపికుంకు
75. మాయమైపోయెను మరికనరాకయ్యె మనుగేవియుండలేను మహిమమిగు,
76. పతితుండు పీడతి పామరుండును మహా సంసార బద్ధుండను జడమతి యని
77. దలచి నన్నార్తియంగ జలధి మగునని జేసి బోయెను వాపురుష పుంగవుండు
78. మేధాంత వేదాంత బోధాంత నిలయుండు యోగయాగాంగసంయుక్తుండు
79. సిద్ధసంయమినాథ సేవించియును పూర్వ పాపంబు వేరునే ర్పరచె నిపుడు
80. కమెరుపుతీగ యనంగ మరుగాయెనా పుణ్య తను నౌడబాసి నిద్దురలేక
81. కన్నదేహాత్మాగ కరము మేలగుసంచు పానాన్న నిద్రలు మాని ప్రాణ
82. త్యాగోన్ముఖుండయి తివబడి పొగ్లుచు మాటిమాటికి తనువు మరచి మరచి
83. ముని వియోగమునకై మూర్ఛిల్లి పడునేను దినములు దుఃఖింప దిశలపండి
84. బంధులాప్తులు మిత్ర భక్తజనంబును పలువిధంబుల దపస్న బ్రస్తుతింప
85. తెలివొంది చెప్పగా దివ్య ప్రభావంబు న్యూనుపేపర్లలో వాసికెక్క
86. గాన సిద్ధులజాడ కనుపుణ్యమని యార్యు లందురీయువని సతిశయముగ
87. పుణ్యాత్ముడగుటచే పుడమి నీ దాసుండు సిద్ధపురుషుని గాంచె స్థిరయశముగ.

గీ॥ మనుజులై బుట్టినందుకు మహిమమిగుల।
నిటగదా సార్థకంబగు నింపుమీర।
నింత కధికంబు తనమది నిందిరేశు।
పూర్ణ రూపంబు గనుగొంట పుణ్యమరయ॥







శ్రీమతేరామానుజాయనమః.

శ్రీమాన్ - కుత్తనూరు- చిన్నసామిశాస్త్రిలువారొసంగిన

—* (అంగీకృతి.) *—

శ్రీమదఖిల వేదవేదాంగ ప్రతిపాదకత్వ సర్వాంతర్యామిత్వ సర్వస్వామిత్వ సర్వాధిష్ఠాతృత్వ సర్వస్మాత్ పరత్వ సర్వేశ్వరేశ్వరత్వ వత్సలత్వ సుశీలత్వాది సకలకల్యాణగుణసంపూర్ణ శ్రీరామభద్ర చరణాంభోజ భృంగరాజేన శ్రీనిఖిలలోకాచార్య సురాచార్య తనుజభరద్వాజగోత్ర కలశరత్నాకర సుధాకర శ్రీకృష్ణయపౌత్రేణ శేషయ్యతపోలబ్ధ సుపుత్రేణ శ్రీగంగా భవాన్యంబాగర్భ శుక్తిముక్తాఫలేన సంస్కృత ద్రవిడ విద్యా సంపూర్ణేన మహాకవినా కుత్తనూరు-చిన్నసామిశాస్త్రిణా రచిత మకుతోభయ మిదం శ్లోకత్రయమ్.

శ్లో॥ శేషత్వ హరివాసత్వ సద్బలత్వాది హిద్గుణైః।
వేంకటాద్రిత్వ మన్వర్థ మాసీద్యస్యవిరాగినః ॥

శ్లో॥ తస్యకైంకర్యశీలస్య కృపయాలబ్ధవాగ్బలః।
కృత్వాంధ్రభాషయాతస్య చరిత ద్విపదాన్వయం॥

శ్లో॥ శ్రీరామచరణాంభోజ భక్త్యాసత్కీర్తనానిచ।
నిష్పాపచిత్తోపుష్పాల రామదాసోవిరాజతే॥



రాయపురము- బో- సుదర్శనదాసులవారొసంగిన

—* (అంగీకృతి) *—

శ్రీమజ్జగద్విలాసమాన చెన్నపట్టణాంతర్గత రాయపురవాస శ్రీమద్భగవద్భాగవతోత్తుంగ కథాప్రసంగ సంగ శాంత రంగ జగత్పవిత్రీకరణ శ్రీమద్రామాయణ శ్రోతృజన హృద్యానవద్య గానరూప శ్రీమద్రామాయణ కీర్తనారచన ధైర్యౌదార్యగాంభీర్య శౌర్యాది సకల సద్గుణ సంచయపాత్ర పైడిపాలగోత్ర గౌరీపుత్ర కులపవిత్ర భక్తవశీకృత రామమూర్తి నిర్మలకీర్తి భాస మూర్తిదాస సుపుత్ర వీరేశ్వర విధేయ సుదర్శన నామధేయ దత్తాంగీకరణ సుపద ద్విపద

శ్రీలలరార గౌరీపుత్రకొలము- మేలిమిగా చని మేదినిలోన* ధనపైడిపాలగోత్రమునజనించి-యిగవొందగీర్తి వహించినీయుమంచి * కరుణవీరాస్వామి గౌరమాంబలకు-వరపుత్రుడై బుట్టి వాంఛతోడుతను *రమణతిర్వేంగడ రామానుజముని - విమలపదాబ్జము ల్వేమరుగొల్చి* అలవారిసత్కృప ననువుగబడసి - కలకాలమునుహరి కైంకర్యమరసి * కలినినికాల భక్తాగ్రుడైమించి-వలనొప్పహరిగుణ వర్ణనసేయనెంచి* సంగీత సాహిత్యముల న-కించితశక్తిలేకైనను * శ్రీరామాయణమాన కటాక్షసంపత్తి జేసి-ధీయుతుల్ పండితుల్ దివ్యసంగీత*చతురులు మది మెచ్చ సద్భక్తవరులు-ఇతులొనర్చ హరిమనోల్లాసమంద* గీర్తనాఫణితిగా కేవలభక్తి-పూర్తిగా నొనరించె పుష్పాలరామ * దాసాఖ్యుడిది రవి తారక చంద్ర - భాసమానంబయి ప్రబలునుగాత॥



రాయవేలూరు - వేంకటకృష్ణదాసులవారొసంగిన

—* (అంగీకృతి) *—

శ్రీమజ్జగత్పతు మార్తాండపావన వంశపయః పయోనిధి చంద్ర పాలిత బ్రహ్మాదిదిక్పాల సురేంద్రదీన కరుణాసముద్ర శ్రీజానకీరామభద్ర

వరపుత్రసుచరిత్ర సాధువిద్వజ్జనమిత్ర సత్యజ్ఞానవాత్సల్యాదిగుణసాంద్ర శ్రీకృష్ణరామానుజ యోగీంద్ర దివ్యశ్రీచరణాంభోజ మధుపానమత్త భృంగరాజ పరమభాగవత శేషభూత నయగుణసమేత వేదాంతవిలాస వేలూరు-వేంకటకృష్ణదాస ప్రణీత సీసపద్యము.

శ్రీమదర్క-కులాబ్ధిసోమ రాఘవరామ-కరుణాకటాక్షవీక్షణము వలన ఆర్యవందిత వేంకట్యాద్రి దేశిక పాద-సేవఘటించిత త్సేవకతన।విజ్ఞాననిధి తిరువేంకటరామా-నుజముని పదంబుల సంశ్రయించి।కమనీయము గహారికైంకర్యములరంగ - గావించిప్రఖ్యాతి గాంచిపైడి। పాలగోత్రభ పుంమి పుష్పాలరామ-దాసు డొనరించెవిష్ణుకీర్తనములలర।జన్మసాఫల్య మగునట్లు జగమునందు-విధుర విభసుప్ర భాసమై వెలయుగాత.

శ్రీమజ్జగద్విలాసభాసమాన

కల్యాణనగరనివాసులగు శఠకోపదాసులవారొసంగిన

—* (అంగీకృతి) *—

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ .గి రాజభట్టార్కదత్త బ్రహ్మారథమహోత్సవ విభవనిర్వాహకనికేత శ్రీమ- -తిరుకో- ఎలూరు తిరుమలము..డి నైనారాచార్యగురువర్య దివ్యశ్రీచరణారవిందసమాశ్రిత పరమభాగవత సేవాధురంధర పెద్దపాటిసద్వంశ పయఃపారావార సుధాకర కవిసంజీవి దాససుపుత్ర సాధుజనమిత్ర సత్కవీశ్వరకృపాపాత్ర శ్రీశఠకోపదాస నామధేయ ప్రణీత సీసపద్యము.

సీ॥ శ్రీమదచ్యుతపాద సేవాధురీణుండు-నిత్యసత్సాదుసాంగత్య రతుడు।పైడిపాలసుగోత్ర భవుడగుపుష్పాల-రామదాసుండుశ్రీరామకరుణ।నిరుపమజ్ఞానధీనిధి ఘనుశ్రీతిరువేంకటరామానుజాంకగురుని।చరితంబువిరివిగా విరచించి సత్కవుల్-భక్తులు నిశ్చలు ప్రస్తుతింప।కలియుగ

గలుగ భక్తాగ్రగణ్యుడనగ-బేరువహియించి యిలజాల పేర్మిగాంచె నిక
గలిలోనిది జదివిన జనములకును-జిరతరంబగు పదవులుహరి యొసంగు.

---

మహాఘనత వహించిన కర్నాటక నవాబువారి

నాత్తులకు రిసీవర్ ఆఫీసుమానేజరు

పంకేటి - నారాయణదాసు గారొసంగిన

—* (అంగీకృతి) *—

సీ॥ శ్రీవిలసిల్లు గౌరీ పుత్రకులజుండు - వాసనుడును పైడిపాల గోత్రఘనుడు వీరాస్వామి గౌరమాంబలకు వరపుత్రుడై జనియించి పొలుపుమీర । నవనిపుష్పాల రామాఖ్యదాసుడు - తిరువేంకటరామానుజాంకగురుని। చరితంబుఖడ్గగా విరచించిపండితు-ల్భక్తులునిచ్చలు బ్రస్తుతింప । ధరణిప్రఖ్యాతివహియించి దాసవర్యు డనగ మిక్కిలి బొగడొందారికరుణను । దీనిజదివిన వినిన నాధీరులకును - నాయురారోగ్యసంపదల్ హరి యొసంగు.

---





శ్రీమతేరామానుజాయనమః.



శ్రీ పాండురంగాయనమః.

శ్రీశైలేశ దయాపాత్రం । దీభక్త్యాదిగుణార్ణవం
యతీన్ద్రప్రవణంవన్దే । రమ్యజామాతరంమునిం॥ ౧.
లక్ష్మీనాథసమారంభాం । నాథయామునమధ్యమాం
అస్మదాచార్యపర్యంతాం । వన్దేగురుపరంపరాం॥ ౨.
యోనిత్యమచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయమేనే
అస్మద్గురోర్భగవతోస్య దయైక సింధో
రామానుజస్య చరణౌ శరణంప్రపద్యే॥ ౩.
మాతాపితా యువతయ స్తనయావిభూతి
స్సర్వంయదేవ నియమేనమదన్వయానాం
ఆద్యస్యనఃకులప తేర్వకుళాభిరామం
శ్రీమత్తదఙ్ఘ్రి యుగళం ప్రణమామిమూర్ధ్నా॥ ౪.
భూతంసరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్
భక్తాఙ్ఘ్రిరేణు పరకాలయతీంద్రమిశ్రాన్
శ్రీమత్పరాఙ్కుశమునిం ప్రణతోస్మినిత్యం॥ ౫.
గురుముఖ మనధీత్య ప్రాహవేదానశేషా
నరపతి పరిక్లృప్తం శుల్కమాదాతుకామః

శ్వశురమమర వంద్యం రంగనాథస్యసాక్షాత్
ద్విజకులతిలకం త్వం విష్ణుచిత్తం నమామి॥ ౧.

మిన్నార్ తడమదిళ్ శూళ్ విల్లిపుత్తూర్ తెన్నారుకాల్
శొన్నార్ కళఱ్కమలమ్ శూడినోమ్మున్నాళ్
కిళియఱుత్తానెన్రురైత్తోమ్ కీళ్మైయినిచ్చేరుమ్
వళియఱుత్తోమ్ నెంజమే వందు ౨.

పాండియన్ కొండాడ పట్టర్ పిరాన్ వన్దానె।
న్రీండియశంగ మెడుత్తూద। వేండియ
వేదంగ్గళోది విరైన్దుకిళియఱుత్తాన్
పాదంగ్గళ్ యాముడైయ పత్రు॥ ౩.

పెరియాళ్వార్ తిరువడిగళే శరణం.

---

శ్రీరామజయం.

శ్రీమతేరామానుజాయనమః.

శ్రీ పాండురంగాయనమః.

# పుష్పాల రామదాసుగారి కీర్తనలు.

కం॥ శ్రీలలనామణి రుక్మిణి వాలాయము దన్ను గొలువ వాంఛితుడై।
భక్తాళిన్బ్రోవన్ వేచుకృపాళుని విఠలేశుదలతు భద్రంబునకై॥

కం॥ మతిమంతులుకవివర్యులుయతిగణప్రాసంబు లెరిగియింపుగపాడుం
గతినే నెరుగను జానకిపతివిను పుష్పాలరామ పావననామా॥

కం॥ సంతత లక్షణ లక్ష్యము నెంతయు నేజూడలేదు యేర్పడమదిని న్।
చింతింపక కూర్చితినిది వింతగ పుష్పాలరామ విమలసుధామా॥

కం॥ అమరము నాంధ్రము కావ్యము లమరగనే జదువలే దనర్గళ।
మగునీ-విమలధయ చేత జెప్పితి ప్రముదిత పుష్పాలరామపావననామా॥

కం॥ వరకవి బృందములకు నే సరగునవందనముజేసి సారసనేత్రుఁడా ।
వరవేల్పు బొగడి వ్రాసితి ధరణిని పుష్పాలరామ దాసువ్రతేమఁడా ॥

చం॥ జగతిని బుట్టి పుట్టి మఱిజచ్చుచునుంటిని గాని నీపదం ।
బగణిత మోక్షదాయియని యెంచక సుచిరకర్మ బద్ధుడై ।
రఘువర వేంకటాద్రిగురు రాజుల శిష్యుడనైతి నన్నికన్ ।
దెగడక వేగచేకొనుము ధీవర పుష్పాల రామరాఘవా ॥

రాగం నాట - (కీర్తన) జంపెతాళం.

ప॥ జయమహాలక్ష్మివర-జయసింధు గంభీర-జయసుందరాకార ।
అ॥ జయనుసుకుమారా॥ జయ-జయా॥ (1)

చ॥ జయత్రిభువనాధార-జయభక్త-మందార
జయవిజయ-సత్కార-జయమేరు-ధీరా ॥ జయ-జయా॥ (2)
జయమధుర-మృధుభాష-జయవిబుధగణతోష ।
జయతు-దశవిధవేష-జయజగత్పోషా ॥ జయ-జయా॥ (3)
జయకనకమయచేల-జయదివ్యవనమాల ।
జయదీన పరిపాల-జయసుగుణ శీలా ॥ జయ-జయా॥(4)
జయసు పుష్పాలరామ-జయ సెద్దుమరసుధామ ।
జయ జయకోదండ రామ జయవినుతనామా ॥జయ-జయా॥ (5)

శా॥ శ్రీలక్ష్మీ హృదయాబ్జ భృంగ సగుణ శ్రీపాండురంగానమో ।
చాలానన్నునెవారబ్రోతువనినీ సద్భక్తి యుక్తుండనై ।
నాలో నిన్నానియాడి వేడిననను నట్టేట బోజూతువే ।
భూలోకంబున జాల జాలివడితిన్ బుష్పాలరామప్రభో ॥

కం॥ తామరపై తోయమువలె వేమఱుతపియించునన్ను వేగమెబ్రో ,
వన్-సామజపాలా-రమ్మిటు-భూమినిపు-ష్పాలరామబుధనుతనామా॥

కం॥ సంసారసాగరంబున గంసారీయీదలేక కదునిడుములనే ।
హింసలబడితిని మునిహృద్ధంసా పుష్పాలరామ దశరథరామా

## పుష్పాల రామదాసుగారి కీర్తనలు.

(కీర్తన)

ఆరభిరాగం - త్రిపుటతాళం.

ప॥ శరణు-శరణు-బ్రహేంద్రాది-వందిత-శరణుమునిగణసన్నుతా ।

అ॥ శరణు-సజ్జనహృదయ నివసిత-శరణులక్ష్మీసేవితా॥

(శరణు-శరణు-హరే॥

చ॥ శరణు-మందర-పర్వతో-ద్ధర- శరణుదానవ-భీకరా ।

శరణు-రవికోటి-ప్రభాకర-శరణు-వదన సుధాకరా॥శరణు॥ (2)

శరణు-రాక్షస మదవిభంజన-శరణు-రఘుకుల-నందనా ।

శరణు-భక్తసుహృదయరంజన-శరణు-సకలని-రంజనా॥శర॥ (3)

శరణు-దేవగణాది-నాయక-శరణు-ముక్తిప్రదాయకా ।

శరణు-పుష్పాల-రామపోషక-శరణు-వేంకటనాయకా॥ శ॥ (4)

శా॥ నాకాచార్యులు వేంకటాద్రులనునీ న్యాయంబులందెల్పగా ।

నాకాధీశసుతా విరించిజనకా నన్నుం దరిజేర్చరా ।

యీకావట్యమికేలనంచుబలుక- న్నేమందుట విఠ్ఠలా ।

షోకల్లానుము నన్నుబ్రోవుమికనో పుష్పాలరామప్రభో ॥

నాథనామక్రియ (కీర్తన) ఆదితాళము.

ప॥ పతితపావనా- పండరినాథా-పాలింపుము-భువి-మీదా-నను॥

పాలింపుము॥ భువిమీదా॥

అ॥ రతిపతిజనకయే-గతిజేశెదవో రాధారుక్మిణినాథా॥ వో ।

పతితపావనా ॥ (1)

నారద-మునిగణ-సేవిత శ్రీమ-న్నారాయణ నాతో వాదా॥భార

మ-నాథాగ్యారాశీ-విఠ్ఠల-పంతమ-ప్రాణనాథా॥వో॥పతితపావనా॥ (2)

మకరకుండలభూష। మంజాళమృదుభాష మౌనిమానసోల్లాసా।

యిక శోధింపకుమీశా-యిటులరక్మి-సర్వేశా-యీబాధకోర్వజగధీశా॥

ఓపతితపావనాపండరినాథా॥ (3)

శ్యామసుందర శ్రీలోల। స్వామీ యిక తాళజాల-నామనవి-విని-పుష్పా
ల-రామదాసుని నేలరమ్మి । రాజసమేలా రావణానుజపాలా॥ వా॥ (4)

శా॥ రాధారుక్మిణినాథ పంఢరిపురీ । రాజంచుమనీ చెంతకుజ్జ ।
మేధావంతులు జ్ఞానదేవులు మఱిజ్జ । మేలౌతుకారాములుజ్జ ।
ఆధారంబవు నీవటంచుమదిలో హర్షించినిజ్జ వేడగా ।
భూదేవిప్రియ వారినేలితివిగా పుష్పాలరామప్రభో ॥

కం॥ దాసునిపై దయజూడునే జేశిననేరంబులెన్నొ చెడుబుద్ధినినో ।
వాసవసుతమది నెన్నుట వాసియెపుష్పాలరామ వరగుణధామా॥

నాదనామక్రియ (కీర్తన) ఆదితాళం.

ప॥ రామరామనను-రక్షింపనుయిటు । రావేమీ।రఘురామా-నే

అ॥ పామరుడనునను-పరిశోధింపక । పక్షముంచుపరంధామా॥
శ్రీరామ॥ రామనను॥ (1)

చ॥ తరుణులమాయలోదగిలి నిన్నునేదలువనైతి నీధరలో
నా-దురితను లెంచక - పుత్రునివలెదయతోడ నేలునను - త్వరలో॥
శ్రీరామ॥ రామనను॥ (2)

అనుదినమునునిను దలచక నేభువి । నల్పులగొలిచితినయ్యా -
ఓ-దినకరవంశోత్తమదయ । తోడను దీనునిబ్రోవురా । మయ్యా ॥
శ్రీరామ॥ రామనను॥ (3)

దాసజనులయెడ దోసములెంచక దరిజేర్చినరామయ్యా- నీ-దా
సుడు పుష్పాల రామదాసుని దయజూడవ దేమయ్యా ॥ శ్రీరామ
రామనను॥ (4)

---

కం॥ గతమునజేసిన కర్మమ్మొ క్షితిలోనీ గష్టమయ్యె శ్రీహరినేనీ ।
గతినుండుట నీకిదిన। మ్మతియే పుష్పాలరామ మంజుళనామా ॥

క॥ పండరిపురవాసానీ। యెండను జేరితినినన్ను నాసలొ గొనుమకో ।
ధండధరా నాపాపము చెండుము పుష్పాలరామ జయరణభీమా॥

(కీర్తన)

హెచ్చరిక - నాదనామక్రియ - రూపకతాళం.

ప॥ గోపీజనసేవిత శ్రీ - గోపాలకుమారా ।

అ॥ గోవర్ధనోద్ధారం। గిరి - ధరో హెచ్చరికా॥ (1)

చ॥ వరదానతి జనచాతక - శరదాంబురహరణా ।
శరణాగత భరణాభవ - తరణా హెచ్చరికా॥ గో॥ (2)
హరవిధినుత చరణాశ్రీ - వరకౌంస్తుభాభరణా ।
ధరధర సకలాసురమద దహనా హెచ్చరికా॥ గో॥ (3)
శ్రీశా పుష్పాలరామ - దాసా హృదయేశా ।
వాసిగనినునమ్మితిహృషీ - కేశా హెచ్చరికా॥ గో॥ (4)

---

శా॥ గోపీచందన। ఘోరశత్రుహరణా। గోపాలకా మంగళం।
పాపఘ్నాహరి। పాండురంగ విఠలా। పద్మాక్షహే మంగళం।
దీపా పుద్ధవ మిత్ర పాపహరణా దీనప్రియా మంగళం।
భూపత్నీయుత మంగళంబు నిదుగో పుష్పాలరామప్రభో॥

రాగంసౌరాష్ట్రము (మంగళం) ఆదితాళము.

ప॥ రాధా మనోహరునకు। రమ్యశుభ మంగళం।

అ॥ సాధుజనా నందనునకు।సరసిజ నాభునకు॥ వేదాంత।
వేద్యునకు వెంకట నాథునకు॥ రాధా॥ (1)

చ॥ దేవాదీ దేవునకు దివ్యశరీరునకు।
భావాజ జనకునకు భవ్యశుభమంగళం॥రాధా॥ (2)
గోవర్ధనో ద్ధారునకు। గోపిమనోహారునకు।
శ్రీవక్షధరునకు। శ్రితజనపోషునకు॥రాధా॥ (3)

ధరలో పు-ష్పాలరామ దాసహృదయేశునకు ।
వరద గో-పాలునకు వరఘన-శ్యామునకు ॥రాధా॥ (4)

---

శా॥ దాసుండౌనను ధన్యుజేయకను నీ-చారిత్రముల్ పట్టితే
నీసందర్శనమెట్లుసేయఁగగునో మీపాదమంటెన్నుడా ।
గాసింబెట్టకబ్రోవవే కర్ణుణతో గాంభీర్యగుణాఢ్యయుక్త ।
భూషించంగను సెంతివాడనుసుమీ పుష్పాలరామప్రభో॥

రాగం - సావేరి (మంగళం) ఆది తాళం.

ప॥ మంగాళామని-బాడరమ్మా పెరుందేవితల్లికి
అంగానా-మణులారా॥

అ॥ బంగారు-పళ్లెరము రంగారగ-బట్టుక ముంగలా-గుమిగూడి
వంగోని-మంగళాంగికి మనసుకటుగగ॥ మం॥ (1)

చ॥ కరకంక-ణములా-కాంతి-దిశల-కెగయ-వర రత్నాభరణములు-
వసుధపై-జ్వాలియా-సరిగెచీరెల-చెంగు-చంద్ర-కాంతి-కెనయ
ధరలో-కరిగిరి-వరదురాణికి-పరిమళముగల-పద్మ-పాణికి॥ మం॥
కాంచి-నగర-ని-వాసికీ-సెనుల-బాంచి-యేలినపుణ్య-శాలికీ వం
చన-లేకను-పరమిచ్చు భక్తుల-సంచితములెడదెంచి - క్రిపసా
యించి-బ్రోచిన-మంచి-చరితకు॥ మం॥ (3)
పరమపావని పెరుం-దేవికి భక్త-పరతంత్రయగు ప-ద్మాక్షికీ ధర
లోపుష్పాలరామ-దాసునిమోహిని పరమకృపతో నేలివుభయ
చరణసేవనొసంగు-తల్లికి॥ మం॥ (4)

కం॥ తల్లివలెనుదయజూడుశ్రీ। వల్లభమునుదీనులైనవ్వారినికరుణ।
ఉల్లములలరగబ్రోచితి। మెల్లనపుష్పాలరామ మేఘశ్యామా॥

శా॥ శత్రుండౌనను-గుందజేసెద్ధవునే సామాన్యుడా దీనుడ ।
మిత్రుండైనకిరీటినే-విధముగా మేధావిగా జేశితో।

ప్రాగ్రుండంచనకే పరాకీననుఁగ పక్షంబుపోనాడితే।
పుత్రుంజూచినయట్లు చూడవలదా పుష్పాలరామప్రభో॥

నీలాంబరిరాగం (కీర్తన) ఆదితాళం.

ప॥ తల్లినీ-దయలేక నా-తండ్రికిదయగ-ల్గుటయసదా॥

అ॥ తల్లిలేనిబి-డ్డలుతపియించుట-తెల్లముగదరయె-ల్లరకుసుధరలో॥త॥

చ॥ చేరివినుతింతూ-నా-శ్రమలెల్లనునీకెఱిగింతూసారసాక్షిరో-వారిజ
నాభుని-కెఱిగించియునా - నేరములెన్నకనెనరునబ్రోవుము॥ త॥
మున్నునీవ-నేకులనూ మన్ననగా నెలితివిలనూ చెన్నుమీరగా
నా-విన్నప మాలించి రవికులాబ్ధి పున్నమచందురునకు దెల్పవే
నా॥ తల్లీ॥ (3)

రామునితో పుష్పాల-రామదాసునికొదవెల్లా-సామజయానా-ప్రే
మమలరగను వేమరుదెలిసియు- భూమినినికపు-ట్టింపకనేలవె॥త॥

శా॥ ఆబాల్యంబుగనిన్నుగొల్చిన ననున్నన్యాయమేచేసియే।
సౌభాగ్యంబులనియ్యక-న్నిడుముల న్జరించితేవిధలా।
యీభాగ్యంబునకా నినున్గొలచినే నిక్లైతినేమందునో।
భూభార్యాయుత నాకుదిక్కెవరికఁగ బుష్పాలరామప్రభో॥

రాగం సావేరి (కీర్తన) రూపకతాళం.

ప॥ తల్లీ-నిను-నమ్మితీ-పెరుందేవి-తల్లీ-నినునమ్మితీ॥

అ॥ కల్లగాదునీ-యుల్లమున-నను-కరుణజూడుము-కమలలోచనీ-
మల్లిజననముురాక ననుమన్నించి- మాధవునితో- దెల్పునా।త॥

చ॥ శ్రీదేవరాజులరాణీ నన్ను శోధింపకుము పద్మపాణీ-నీదెభారము
గాక-యికనన్నాదరించ నెవ్వారులేరు అనాథపోషకుడై వెలుగు
శ్రీ-హరితో దెలిపినా-దురిత మణచుము తల్లీ॥ (2)

చిన్ననాటి నుండినే నిన్నా। చాలానన్నుతింపుచున్నా నన్నా
కన్నతల్లివి గాననేడు కఠినమెందుకు కరుణజూడు-చెన్నుగా। వరదునికి
చెవులను విన్నవించు విధంబుజూడు తల్లీ॥ (3)

జాలము జేసుట మేలా। చాలు చాలు జన్మములెత్తి-జాలా పా
లుమాంరక భక్తులను మును పాలించిన బలు మేటివి పు-ష్పాలరామ-
దాసుడనునీ పాల బడితిని నీలవేణీ॥ తల్లీ॥ (4)

శా॥ తల్లిన్దండ్రిని గావిడిన్ని లిపియా-ధన్యంపు తీర్థంబులన్ ।
మల్లంబందున బ్రీతిభక్తియునుమే లుత్సాహముల్ గల్గిచూ ।
మెల్లంగ్రుమ్మటి స్నానసంధ్యలు మొదల్ సత్కృత్యంబులుం ।
జేయుచున్ఫుల్లాబ్జాననుడుండు-పండరిగనెన్-పుష్పాలరామప్రభో॥

రాగంకల్యాణి (కీర్తన) చాపుతాళం.

ప॥ తల్లీ సీతా నీదు దయలేకికను నాదు తండ్రికీ-నయ-గల్గదు
అ॥ యెల్లలోకములను-నేలుశ్రీయఃపతికి-వల్లభివైయున్న-తల్లీ॥
ననుగన్న॥ తల్లీ॥ (1)

ప్రహ్లాదనారద పరాశరులునీ పెద్ద బిడ్డలో భువినీ ఆహ్లాద కరు
డంబ రీషుడు వ్యాసుం డాప్త బంధువులో నీకూ-సాహ్లాదుడైనయా-
శుక శౌనకాదులు సఖులౌదురో నీకూ ఆహ్లాదముగవీ రందరి రక్షించి
విహ్లాదుడగునన్నుం వేగ బ్రోవు మనునా॥ తల్లీ॥ (2)

పుండరీకుని చెంత చేరి బ్రోచినాడు కుండలిశయనూడూ అండ
జేరిరు-క్మాంగదర్జునులకు అభయమిచ్చినాడూ-నిండుదయతో వి-భీషణున
కులంకనిచ్చి యేలినాడూ మండితగుణనను బ్రోచనీ భువియందు అండ
జగమనుని-కిని దెల్పుము ముందు॥ తల్లీ॥ (3)

జనకచక్రవర్తి నాంజ నేయుల్నను సంరక్షింపగ లేదా వనమునను
న్న వాల్మీకమునికిని-వరములొ సంగలేదా-ఘనదురితాను బంధుండబా
మీళుని-గాచిరక్షింపలేదా అనవరతము పు-ష్పాలరామదాసుడు వినుతిం
చెడిగావు మని దెల్పవె నేడూ॥ తల్లీ॥ (4)

కం॥ అచ్యుతుని వక్షమందున । ముచ్చటగా నిలచిభక్త । ముఖ్యులనె
ల్లన్ । హెచ్చుగ పరిపాలించెదు । లచ్చి యొసగు సద్గతులను।
లాలనతోడన్ ।

శా॥ అక్రూరాదుల్ । అతిమిత్రులుద్ధవులునా। యంతఃప్రియుల్ నార దుల్-శక్రాదుల్ సహ శాంభవీ సహజులా-సర్వేశ సోపానదేవ్ వక్రంబేదియులేని భక్తియుతులై వర్ణించి సేవింపభూ చక్రంబె లేదు శైవమీవుగదరయో । పుష్పాలరామప్రభో॥

(కీర్తన) సుజనజీవనం సుగుణభూషణం అనువర్ణమట్టుగా.

నాటకురంజి - (కీర్తన) రూపకతాళం.

ప॥ అలమేలుమంగమ్మా-నన్నాదరించవమ్మా॥అలమేలుమంగమ్మా॥

అ॥ జలజలోచనీ । భవ । భయవిమోచనీ యిలనీమృదు పదయుగముల సెదను నమ్మితినీ॥ అల॥ (1)

చ॥ శ్రీనివాస- వక్షవాసి- శ్రితజనోల్లాసీ- భానుకోటిప్రకాశి - భవభయనాశీ- మానసమునసూ- నిను-మరువలేనికనూ-దీనజనసం - త్రాన-నేనియ్యా-దీనమైతినీ॥ అల॥ (2)

అవనిమానవులకు-సిరు లనుగ్రహింపలేదా - అలబ్రహ్మాదులకుసర్వ-సంపదనీవు-గాదా- వివిధ-గతులనూ-నిను-వేడితి- దయనూ- భవ సంఘము లెల్లద్రుంచి- పాలింపుమునన్నూ॥ అల॥ (3)

శరణాగ- తాళికెల్ల- సేవయొసగినావూ-అరమరలేకను భక్తుల-కభయమిచ్చి- నావూ-శరణన్న వినవూ-నను- సంతరించవూ- ధరలో-పు-ష్పాలరామ-దాసునిబ్రోవూ॥ అల॥ (4)

శా॥ శ్రీనాథా గజ రాజునేలుతటినీ । చేజిక్కనే లంచమున్। ల్దీనాలాపముల । న్వినే ధ్వారవనే ధీసన్నుతా గొల్చితిజ్ఞ। నేనేమైనను లంచమిత్తుననుచు న్నిక్కంబనీ వెంచితో। పానీపామ్మొక కానులేదుగతియో పుష్పాలరామప్రభో॥

జావళి-ఇన్నాళ్లవలెగాదె అను వర్ణమట్టుగా,

జావళి - రాగం - నాథనామక్రియ - యేకతాళం.

ప॥ శ్రీరంగనాంచారమ్మా బ్రోవయిటు । శీఘ్రమెరాకుండు టకుయేమి హేతువమ్మా॥ శ్రీరంగ॥ (1)

అ॥ శ్రీరంగరాయుని రాణివో వినవె నే। కోరినవరముల కొదువలన్ని యుఁ దీర్చ । రాగదవే । నను రక్షింపవే। యిదితగవే యిక। నెవ్వరిని। వేడుకొందు॥ శ్రీ॥ (2)

పామరుడగు నన్ను । పాలింపకవీడను । నేమముతో నిన్నే । నెర నమ్మియున్న । వాడనవే-నా ! వరమియ్యవే కడుపేదనవే । కరుణింపవే॥ శ్రీ॥ (3)

ధరణి పుష్పాలరామదాసుని నేలిన - పరమపావనిరో నా పలుకులనూ । వినవలెనూ।మది।గనవలెనూ ఇయ్యాలనూ॥ శ్రీ॥ (4)

శా॥ కాసున్నీసములేక గష్టపడెదన్ గంజాక్ష కంసాంతకా।
యీసంసారపుబాధలో-మునిగితి న్నింకైన రక్షింపవే।
యాశాపాశము లంటజేయక నునా కాధారభూతుండవై।
పోషించంగలవాడవే విఠలరో పుష్పాలరామప్రభో॥

తోడిరాగం - (కీర్తన) రూపకతాళం.

ప॥ కరుణజూడవమ్మా తల్లి కరుణజూడవమ్మా కరిగిరీవరదునికొమ్మా॥

అ॥ పరమాపా। వనుయురమున భాసిల్లగ వెలసీ యీ।ధరలోగల చేతనులకు।దర్శన సంపదలిచ్చి దయతో నేలిన।లచ్చి॥ కరుణ॥ (1)

ఎల్లలోక ములను నేలు తల్లివైన । నినుబోలు తల్లియులే- దనుచును నా । యుల్లము రంజిల్లగనిను కొల్లగ నుతియించెదనను॥క॥ (2)

అండాజా వాహనునికి అంతరంగమైన రాణి।మండలమున నిను వలగొని।దండిగ వేడితినిన్ను దయతో నేలవెనన్ను॥ క॥ (3)

దేవరాజులకునాత్మ దేవివైన పెరుందేవి।భావమలర పు-ష్పాలరామ భక్తుని భావంబెరిగియు ముక్తినొసగ నీకేతగు॥ క॥ (4)

కం॥ యతిరాజవరుని । పదముల నతిశయముగ మదినిదలచి । యతులితభక్తిన్। నుతులన్ జేశెడివార్లకు।సతతంబును పరమపదము సాక్షీప్యమగున్॥

(కీర్తన) రాగం - సౌదనామక్రియ - రూపకతాళం.

ప॥ భాష్యకారా। గురువర భాష్యకారా।

అ॥ శేషావతార శ్రీ। భూతపురీవర॥ భాష్య॥ (1)

చ॥ గురునియాజ్ఞ। మీరినరులకృపతోను బ్రోవదామో।

ధరగోపుర। మెక్కిమంత్రము ధాటిగ జల్లిన మేటియగునట్టి॥ భా॥ (2)

కంచినగర మునసువరదు కైంకర్యము సేయగోరి।

మంచితీర్థమెత్తిసా యించి మించి సంత సించిన యట్టి॥ భా॥ (3)

యాదవప్రకాశువద్ద వేదములనభ్యసించు నెడల।

భేదార్థము వినిమదిలో ఖేదము నొందియు వాదించినట్టి శ్రీ॥ భా॥

ధరలో పుష్పాలరామ దాసునిదరి జేర్చునని।

పరునితోడ బలికియిలను పాలనజేయను లీలతో బుట్టిన॥ భా॥ (5)

కం॥ శేషావతారభూతుని। శోషిత పాషండ తండు। శుద్ధవివేకుణ్।

భాషాపతి నుతునిమిత భాషుని। రామానుజార్య బ్రస్తుతి జేతుణ్॥

(కీర్తన) రాగం బ్యాగ్ - ఆదితాళం.

ప॥ రామానుజాయను। నామ। మంత్రమునీవు వేమారు స్మరియించవే।

నీవు। వేమారు స్మరియింపవే॥

అ॥ పామరసంసార భ్రాంతులణచును। పాడీ। యాడీ వేడవె మనసా॥

రామానుజా॥ (1)

చ॥ యెల్లలోకములు నేలెడిశ్రీభాష్య కారులెవో మనసా-కల్లగాదుయతి।

రాజుల భజియించి కడతేరవే మనసా-ఫుల్లమలరభూత పురవిహారుని

సదా మల్లించి మల్లించి మతిగొను-వో మనసా॥ రామా॥ (2)

చల్లనికృప డిల్లకేగి చల్వపిళ్ళ। జెలగ దెచ్చెనె మనసా। మెల్ల మెల్లనె

యొదిరించి షణ్మతముల। కొల్లలాడెనె మనసా అల్లాడక యతిపతి।

రాజుగతియనిఁ-యాడీ-పాడీ వేడుక-లలరగ॥ రా॥ (3)

భాసురముగ భక్త జనులతో ద్వేషము బడబోకు। వో మనసా వాసి

గ పుష్పాల-రామదాసుని నేలు। వరయోగి, వో మనసా కోశబాధము

లు। కోర్కె-లుడుగువారి- కోరీ-కోరీ-కోరియుండుమనసా॥ రామా॥ (4)

కం॥ సీతాపతి పనులెల్లను । ప్రీతితో నెరవేర్చి ధరను పేరు గొనినసీ।
ఖ్యాతింబొగడ । తరమ నా। దాతావీరాంజనేయ దరిజూపగదే॥

(కీర్తన) రాగం-వసంతం - ఆదితాళం.

ప॥ ప్రసన్నాంజనేయా నాదు ।

అ॥ వ్యసనంబెల్లను వేగ।నశింపజేయ వేమయ్య-ప్రసన్నాంజనేయా॥

చ॥ దుష్టరక్కసులను ।ఁదునిమితి । ఎళనాదు । కిష్టములను బాపు।
కిరుణతో మహాప్రభో॥ ప్రస॥ (2)

ఆంజని సుతరిపు। భంజన నామది రంజిల్లజేయునీకు అంజలి-జే
సెద॥ ప్రస॥ (3)

మత్తడనుచునను।మరచుటన్యాయమ। ఉత్తమోత్తమ వో చిత్తూ
రిపురవాస॥ ప్రస॥ (4)

ధరలో పుష్పాలరామ దాసుకోరికెపేర్చి। నరగునబ్రోవు మిక।
సాగి మ్రొక్కెదనీకు॥ ప్రస॥ (5)

శా॥ శత్రుత్వంబైనను రావణుండతని నాత్మాత్తమునిర్ । బ్రోచితే ।
పాత్రుండంచనక। న్ననున్। గతినుదై పాలించకున్నావయా।
ఉత్రారిస్తుత పాండురంగ విఠలా యుత్సాహమా నీకునే ।
పుత్రుండే దయలేదుగా విడువకో పుష్పాలరామప్రభో ॥

రాగం - (కీర్తన) నాథనామక్రియ - ఆది.

ప॥ శరణుజొచ్చితినిగో-పాలా- నన్నరమర సేయక కరుణింపవేలా

అ॥ స్థిరముగ-నమ్మితిచాలా నర।హరినేనీ దాసుడనయ్య।యీవేళా॥శ॥

చ॥ పంచపాండవస।హాయా యింత వంచనసేయుట వలదప్ర
మేయా పంచజేరితి బ్రోవవయ్యా కోప। గించ తగ్గదునిన్ను॥ కీర్తిం
తునయ్యా॥ శర॥ (2)

పతితపావన బిరుధాంకా।నా। గతినీవనుచున మ్మితిని।శుభాంగా
నరులనునే గొల్వలేకా నిన్ను బతిమాలివేడితి పలుకుపరాకా॥శ॥(3)

శ్యామసుందరకామ { జనకా।నీ।ప్రేమజూపవదేమి నామీద-యు లుకా । నామనవి వినుమియే । మరకా-నీ । నామమెగలియని నమ్మితి గను కా॥శర॥ (4)

తిరువల్లి క్కేణిని వాసా।నా।దురితములను వేగ ద్రుంచు।సర్వే శా పరమపురుషజగ।ధీశా।వేద।పురుష లక్ష్మమనో౦। భోజని వాసా॥శ॥(5)

ధరలోన బుష్పాలరామ దాస పభుని మొఱవినక వదలుటఘ నమా సిరివరయిది ధొరతనమా భక్త। వరద నే।జేసెదు మొఱ చెవి వినుమా॥ శరణు॥ (6)

శా॥ భక్తాగ్రేసరులెల్ల జుట్టుకొనిని। న్మధ్రంపుతాళంబులన్।
ముక్తింగోరుచు విఠ్ఠలా।యను మిబ। ల్మోదంబుతో। నాట్యముల్।
శక్తిన్ జేయుచు। నాడి పాడి శ్రమచే। సర్వేశని।నెన్ను చున్।
భుక్తింగోరక యుండిరంచు విన వో।పుష్పాలరామప్రభో॥

శా॥ శ్రీశౌకాపర మాది।నందులునునా। శిష్టుల్। కబీరున్కమాల్ ।
దాసుల్నీరసి కాము రారి।యునునా ధన్యుల్।మదన్మోహనుల్।
యీశాదసంచు కుమార నారయణులున్।యూచిన్మయానందులున్
నోన్నె సాధుప్రియు విఠ్ఠలా।యని రెయో।పుష్పాలరామప్రభో ॥

క౦॥ నాదుతల్రవ్రాల ననుపరి శోధన।జేసెనహాయింక।సుజనోద్ధారా ।
వేధన నే బడలేరా శ్రీధర పుష్పాలరామ। శ్రీరఘు రామా॥

రాగం సురటి (కీర్తన) ఆదితాళము.

ప॥ భజన సేయవె మనసా। భక్తితో।భజన।సేయవె మనసా॥

అ॥ భజన సేయవె మన। భుజగ శయనునీ। సుజనులతోనుగూడి నిజభక్తి నివేడి ॥భజన॥ (1)

చ॥ దేవాది దేవుని దేవకి తనయుని భావజ జనకుని భవ్యచరిత్రుని॥ భజన॥ (2)

సరసిజ నేత్రుని సనకాదిస్తోత్రుని సరిరెయెందు లేదని సతతము మతిబూని ॥భజన॥ (3)

గోపీమనోహరుని గోవత్సపాలుని ఆపద్బాంధవుని ఆదిపురు
షోత్తముని ॥భజన॥ (4)

ఖగపతి గమనుని కౌస్తుభవక్షుని నిగమ వందితునీ నిరుపమ
దేహుని ॥భజన॥ (5)

ధరలో పుష్పాలరామ దాసుని నేలిన పరమపావనుని పంకజ
నాభుని ॥భజన॥ (6)

శ్రీమతేరామానుజాయనమః.

వానమామల ఠ3-డో పీఠం స్వాచార్యతనయు.

శ్రీమద్వాన మహాద్రిసం।యమిపద ద్వంద్వాబ్జ భృంగాధిపం ।
శ్రీమద్విష్ణు హృదాత్మజా పదయుగే విన్యస్త।భక్త్యుజ్వలం।
భృత్యం తద్వయ గూఢభావ విశదీ।కార ప్రవీణంసదా।
శ్రీరామానుజ యోగివర్య।మనఘం సేవేగుణాం।బోనిధిం॥

(స్వాచార్యస్తుతి)

గీ॥ వానమామల జియ్యరు వారిపాద ।
పంకజంబులు నెదలోన బదిలబఱచి ।
ధ్యానమొనరించు శిష్యుని ధన్యుజేసి ।
పరమ పదమియ్య వేడితి బరగ నిపుడు ॥

రాగం యిందూస్తానికాపి (కీర్తన) ఆదితాళం.

ప॥ వందే శ్రీమ ద్వానాద్రీశం- వందిత శ్రీమ ద్వరయోగీశం ।

అ॥ బంధమోచనప్రభావ యతీశం సుందర రూప విజిత
కామేశం ॥వం॥ (1)

చ॥ విగతప్రాకృత వస్తువిచారం భగవచ్చరణను।భావితసారం॥(2)
నిగమాంతార్థ। నిర్ణయధీరం । అగణితకల్యా । ణగుణాకారం॥ వం॥
సారాసారవి చారప్రచురం సారాచార।స్థాపక।చతురం (4)
మారోపమసుకు। మారశరీరం ధీరరామానుజ దివ్యాకారం॥ (5)

మాన్యగుణా, గుణ మహితా భేదం మారకార్య దుర్మత
విచ్ఛేదం॥ (6)

ధన్య పుష్పాలరామ (రాసాసుమోదం ధాత్రీసమ శమ దమగు
ణమోదం॥ వం॥ (7)

శా॥ శోధింపంగను నెంతవాద వితలా। సుశ్శీలుడ స్థానునన్।
బాధన్ బెట్టుట। ధర్మమార్గ మగునే। భాషాపతిస్తోత్రనీ।
పాదంబుల్గతి। యంచు నమ్మితినినా పాపంబులన్ దల్వకే।
బోధింపన్దగదే। కృపాజలధివై పుష్పాల రామప్రభో॥

కం॥ ఎన్ని విదంబుల శ్రీహరి। నన్నీ శ్రమ బెట్టనేల। నాతలవ్రాలా। చిన్నె
లు చేసెదవేలా। సన్నుత పుష్పాలరామ శాశ్వతనామా॥

కం॥ మఱచుటధర్మమె। రామా త్వరగ గరుడుని నెక్కి సొక్కి తరలియురమ్మా। మొఱలిడిసోలితి। గనుమా గిరిధర పుష్పాలరామ-కీర్తితనామా॥

కీ॥ ఏలరాకరుణాలవాలకృష్ణా అను కీర్తన వర్ణమట్టుగా

శ్రీమాన్ వేంకటాద్రిస్వామి సద్గురుభ్యోనమః.

(కీర్తన) రాగం కమాసు - ఆదితాళం.

ప॥ ఔతరించెను। వేంకటాద్రులు అవనితలమునన్ । ఔతరిం
చెను వేంకటాద్రులు॥

అ॥ భూతలమున ప్ర। ఖ్యాతితోడను ఖాతవంశము ధరను । త
రింపగ॥ ఔత॥ (౧)

చ॥ అక్షయ వత్సరశుభ వుత్తర ఫాల్గుణశుద్ధ । పక్షపు పున్నమో
త్తమ ఫల్గుణియందు। రక్షకునాజ్ఞ్యనుసోమ వృశ్చికలగ్న వెం
కమ్మ। కుక్షిభాగ్య మహిమశ్రీ వత్సగోత్రజులై క్షమ॥ ఔత॥ (౨)

ఎల్లలోకములకెల్ల నెన్నిక జెందినయా। అల్లూరిగ్రామపు అగ్ర।
హారమునందూ। తొల్లిటి సుకృతము। లెల్లను। పోగైయొక ము
ల్లెగబుట్టెనుభువి। ముద్దుగుల్కు వెంకయ్యకు॥ ఔత॥ (3)

పుట్టెను। కృష్ణానదియు। గట్టునను యాదవేశు। పుట్టిన వేళకుసరి।
కట్టియుండుగా। అట్టివారి చరిత్రము. ఆదిఅంతములనెల్ల । పుట్టి
యుండ జేశితి పుష్పాలరామ దాసుడిల॥ ఔతరించెను॥ (౪)

వ॥ శ్రీమదుభయవేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాంత ప్రవర్తకులును శమదమాద్యనంత కల్యాణగుణగణ పరిపూర్ణులును జ్ఞాన భక్తివైరాగ్య సంపన్నులునునగు భగవత్కైంకర్య కుతూహలులును పరమహంసస్వరూపులును అవతార పురుషులునునగు శ్రీమాన్, వేంకటాద్రిస్వాములని ప్రపన్నగోష్ఠిచేకొనియాడంబడిన మహానుభావులగు శ్రీతిరువేంకట రామానుజజియ్యరుగారి (చరమతనయలు.)

శ్లో॥ విఖ్యాతే ధాతువర్షే దివసపరి వృఢే కుంభగే కృష్ణపక్షే తిథ్యాం సప్తమ్యభిఖ్యాయుజి శశిదివసే స్వాత్రతారాసమేతే శ్రీరంగేశాం ఘ్రిపద్మే సతత విరచితా శేషకైంకర్యలక్ష్మీః శ్రీమాన్ రామానుజార్యః పరమపదమగాత్ వేంకటాద్రిర్యతీంద్రః.

శ్లో॥ మాఘమాసే కృష్ణపక్షే సప్తమ్యాం మిందువాసరే రామానుజయతిః ప్రాయాత్ స్వపూర్వాద్యుషితంపదమ్.



కం॥ నారాయణయనిపిలువగ-నేరాయనిమాటపలుక-వేమిదిబిగువో।
ఘోరాపదలం బడితిని-రారాపుష్పాలరామ-రాక్షసభీమా ॥

కం॥ వేగమె నను జేకొమ్మిక భాగవతులపాదధూళి భక్తిశిరమునన్ ।
బాగుగదాల్చుట యొకటే నేగనపుష్పాలరామ-నేడిటురమ్మా॥

శా॥ మాతాపిత్రులపాదపంకజములన్ । మందారపుష్పంబులన్।
ఖ్యాతిన్‌జెందిన కేతకీ సుమములన్ గైకొంచునాచంద్రభాగ్ ।
శ్రీతీర్థంబభిషేకముల్ సలిపియా చెల్వొంపు పుష్పాలచే ।
పూతాత్ముండగు పుండరీకుగొలిచెన్ పుష్పాలరామప్రభో ॥

నాధనామక్రియ - (కీర్తన) ఆదితాళము.

ప॥ భజింతు చెందమునన్ మదీయ భవవనకుఠారకున్ ।

అ॥ సుజనవంద్యు తిరు-వేంకటరామానుజజియ్యరుపద పంకజ యుగముల్॥ భ॥ (1)

చ॥ అజ్ఞానత్రయ మణచిలోకములకు సుజ్ఞానము వెలి-గించెడి దీపము॥భ॥(2)
ఘోరపాప ప-ర్వతరాసుల డెగ బ్రాగగూల్చుశో భనకరవజ్రము॥(3)
తాపత్రయదా వాగ్నులమాన్పెడి యేపుమీరు ధారామృతవర్షము॥భ॥
భవకూపమునందు బడినజనులను అవలీలను పై కెత్తెడి యంత్రము॥భ॥
అమరేంద్రాదుల కరుదగుసీమకు శ్రమలేక నెగొం-పోయెడు తేజము॥(6)
ధర పుష్పాలరామ దాసునిమది సిరవుగ నివసించెడిగురురాజము॥ భ॥

---

శా॥ కాంచెన్ నిన్నడు బాలుడై ధ్రువుడు సత్కా-రుణ్య హేవిఠ్ఠలా।
యుంచుంగొల్చిరి చంద్రగోరకులునీ యాధారమే వేగర।
మ్మంచు న్ప్రార్థన వేంకటాద్రిజియరుల్ మాపున్నగల్ చేయగా।
ప్రొంచే కాచితి వెంతధన్యుడతడో పుష్పాలరామప్రభో॥

కం॥ మాతాపితురులు మడియగ ప్రీతిని గురువేంకటాద్రి-ప్రియశిష్యుడనై। చేతోముదమందితినా। ధాతాపుష్పాలరామ దానవభీమా॥

కం॥ ముప్పున యమకింకరులకు। నొప్పింపకునన్ను బట్టి యొకమలాత్మా।
చెప్పితి-నికనను మఱువకు తెప్పనపు-ష్పాలరామ-త్రిభువనకామా॥

కీ॥ పాండురంగవిఠ్ఠల దయతోనను పాలింపగరాదా అనుపల్లవమట్లుగా,

రాగం ముఖారి (కీర్తన) రూపకతాళం.

ప॥ శ్రీమాన్ వేంక-టాద్రి గురుని భ-జించి మనవె మనసా।
అ॥ ధీమణి మణివై పరమ పదము సెం-దెదవు వేగ మనసా॥శ్రీ॥ (1)
చ॥ తంబుర తాళమృదంగ గతులతో తనువుమరచి మనసా।
తుంబుర-నారద మునుల క్రియ యతని స్తుతింపవే మనసా॥శ్రీ॥ (2)
భగవ దనుభవమె పోషకమై భువి బరగెనతడు మనసా।
భగవత్కైంకర్యమె భోగ్యంబై ప్రబలె నతడు మనసా॥ శ్రీ॥ (3)
భువిలో పు-ష్పాలరామ దాసుని బ్రోవను-ప్రబలెనతడు మనసా।
అవతరించె ప్రహ్లాదాంశంబున నను పము డై మనసా॥ శ్రీమాన్
వేంక-టాద్రి గురుని భ-జించి మనవె మనసా॥ శ్రీ॥ (4)

శా॥ రామా రాఘవ రామచంద్రయనుచున్ రాత్రింబగల్వేడగా।
నేమోయూరక జాగుసేయుటలు నే నేమందునో పూర్వముల్।
వేమారున్వినుచుందు తాపసఘను ల్వేడ్క-న్మునుల్సేయగా।
భూమిన్భక్తుల కల్పభూరుహమ ని-న్పుష్పాలరామప్రభో॥

టీ॥ తల్లిజానకి నీకృపలేక నా తండ్రికి దయగల్గునా అనుపల్లవుగా.

కల్యాణిరాగం (కీర్తన) ఆదితాళము.

ప॥ రామా-రఘుకుల-ధీమణీ-నన్నూ రక్షించు కృపతోని గ్గారుణీ॥ వేమారు నీపాద తామరస యుగము నామది నుంచెద। నన్ను నీదేర్పుమీ॥అ॥ప్రేమజూడవదేమి నాపై సామగానవిలోల సుగుణ స్తోమ నిర్జితకామ విబుధ లలామ సీతా- కామ శ్రీరఘు॥ రా॥ (1)

చ॥ ఎన్ని విధముల ను-తించినానన్నూ మన్నింపవదియేమి వంచనా పన్నగ శయనయా పన్న సంరక్షణ నన్ను మన్నింపనీ కన్న ధన్యుల గాన-కన్నతండ్రివి నీవెయంచును పన్నుగానీ చిన్నిపదములు సన్నుతించినగాని దయరా-కున్న దేమని విన్నవింతును॥ రామా॥ (2)

నీరజ దళ నయనా భక్తజన ఘోర కలుష హరణా కారణకర్తవూ కమలా భర్తవూ సారసభవనుత చరణయుగళుండవూ-చేరి నన్నిటు బ్రోవకుండుట మేరగాదుర శ్రీరఘువీర సారెకునునీ నామస్మరణ నే-మారకనునే కోరిసేతురా-రామా రఘుకుల ధీమణీ నన్ను॥(3)

మారజనకనాతో వాదా నా నేరమెంచకు రఘు-నాథా-నారద వినుతపాదార విందక్షీర వారిధిశయనశృంగారసూధీరా-జారచోర గభీర సుజనో-ద్ధార నాయెడ నేరమెంచకు రారపుష్పాల రామదాసుని భూరిపాపవిదూర ధీరా॥ రామారఘుకులధీమణీ॥ (4)

## ప్రకటన.



వ॥ సకలదేశములలో నుండగల అఖిల భక్త శిరోమణులారా ! పొలుమారక మీస్నేహితులకు శ్రద్ధతో జదివిచూపుడు. అత్యాశ్చర్యకరమగు విశేషమహిమలుగల నూతన చరిత్ర ౨౨ సంవత్సరములకుముందు జరిగిన సంగతులేగాని బహుకాలములకు ముందు జరిగిన సంగతులుగావు.

వ॥ మమసద్గురునాథులు పరమభక్తులు పావనమూర్తులు- కర్మరహితులు జ్ఞానపూర్తులు-అరిషడ్వర్గము లణచినధన్యులు బ్రహ్మచర్యమెడబాయని నిపుణులు హరిపాదాంబుజ అమృతపానులు వరదునిభక్తులు పరమపవిత్రులు కైంకర్యనిరతులు కామరహితులు ఇక్కలియుగ ప్రహ్లాదావతారంబనియు అవతారపురుషులనియు ప్రపన్నగోష్ఠిచే కొనియాడంబడిన మహానుభావులగు పరమహంస స్వరూపులగు శ్రీమాన్-వేంకటాద్రిస్వాములని దివ్య తిరునామముచే తేజరిల్లుచుండిన శ్రీతిరువేంకట రామానుజ జియ్యరుగారి ప్రభావవిశేష మహిమలుగలచరిత్ర.

(విషయసూచిక (సీసమాలికగా) నిందునజేర్చియున్నది.)

వ॥ ఇదిగాక యిమ్మహానుభావుని చారిత్రము మూలగ్రంథములు (3) విధాయకమ్ములుగా మిక్కిలి బాహుళ్యముగా వెవ్వేరుగా3పుస్తకములుగా వ్రాయబడియున్నవి.

(1)-టో భాగము-పద్య గద్య రగడరూపంబుగా నత్యద్భుతంబుగా-నమరినచారిత్రంబొకటి.

(2)-డో భాగం-తోహారాలుగానున్ను కథను అనుసరించిన కీర్త నలుగానున్ను మిక్కిలిఅన్వయమగు కందపద్యములు సీసపద్యములు సీస మాలికలు చంపకములు శార్దూలములు ఉత్పలములు లావణీమనోహ్లా దముగానున్ను భక్తిరసముగాను యున్నట్టి చారిత్రం బొకటి.

(3)-డో భాగము- ఈమహాత్ముని కథ ఆదిఅంత్యమువరకున్ను తోహారాలుగా వ్రాయబడిన్న చారిత్రంబొకటి.

(4)-గో భాగము అఖండ భక్తి జ్ఞాన సంపన్నురాలగు సక్కు బాయమ్మగారి మహిమలు మిక్కిలి మనోహ్లాదముగా శార్దూలవృత్తము లుగా నమరియుండగల చారిత్రంబొకటి.

మరియు శ్రీకృష్ణపరమాత్ముని లీలావిషయముగా సంకీర్తనలు కొన్నియు భక్తిసార క్షేత్రంబగు పండరాపురంబునతొల్లి అఖండ భక్తిజ్ఞాన-సంపన్నులగుఅనేకభక్తకోట్లనుబ్రోచిన శ్రీపాండురంగవిఠల్ నాథునివిషయముగాను పరిపరివిధములుగా రచియింపంబడిన సంకీ ర్తనలు-కొన్నియు జాపళివర్ణమట్టుకీర్తనలు కొన్నియు ఇంద్రసభవర్ణ మట్టుకీర్తనలుకొన్నియున్ను ముద్రింపఁబడును. ఇదిసుమారు (4-5) భాగములు కావచ్చును.

ఇదిగాక పుష్పాలరామదాసుగారిచే రచియింపబడిన శ్రీహరి నామసంకీర్తనలు-మిక్కిలి భక్తిరసముగా-నుండును.

మఱియు పుష్పాలరామప్రభుశతకంబొకటి- పుష్పాలరామస్తవం బొకటి శ్రీపండరిపురక్షేత్రమహిమ సహితంబుగా శృంగారంబైనపెండ్లి పాటల పుస్తకంబొకటి స్వతసిద్ధముగా-నున్నది.

ఇట్లు, పుష్పాలరామదాసు.

---

సీ॥ ఎల్లలోకంబులనెన్నికకెక్కిన అల్లూరనెడుగ్రామ యగ్రహారము నవెంకయాఖ్యుడా ఘనుడుశ్రీవత్సగో । త్రునిదేవి వెంకమ యను పతివ్రతకు శాలివాహనశకము । పదునెనిమిదినూర్ల । యరువదిరెం

దును జనుతరిని । యక్షయ-వత్సరమందు । ఫాల్గుణశుక్ల పక్షమి।
యుత్తరఫల్గునిదు । దినమునవృశ్చిక । దివ్యలగ్నంబునం । దవత
రించెనుకృప । నవనివేంక (గి) టాద్రి-సుగుణాలవాలు । డత్యద్భు
తంపు । మహిమనుదార్యనుతుండుశ్రీ । మంతుడనుచు । నార్యులెల్ల
నుబొగడగ । నబ్జనాభు భక్తి తనదివ్యతనువున । రక్తిమీర॥

కం॥ తల్లియు-దండ్రియు-నన్నలు। నెల్లరయొక్క-ప్రేమసలుప దినమాత్రముశ్రీ
వల్లభు-వనిశము-మరువడు। తొల్లిట ప్రహ్లాదుమహిమ-దోపగజగతిన్॥

కం॥ పంచాబ్దంబులపైనను పంచాయుధ ధరునిమీద భక్తిప్రౌఢమిన్।
మించెను ప్రహ్లాదునివలె నెంచదరమె వేంకటాద్రి నిలనెవ్వరికిన్॥

చం॥ గరుడుని మూపునెక్కి కౌని కౌస్తుభమున్ ధరియించి సొంపుతో।
నురుమణి వజ్రభూషణము లొయ్యనదాల్చుక వేంకటాద్రికిన్।
గిరమరుదారనెయ్యమున గంటికిదోచియు గామరూపుడై।
తిరముగ శౌరియిట్లనుచు తేజముమీరగ బల్కెనత్తరిన్॥

కం॥ వరమణిరత్నమయంబైకరమరుదగు వైరముడియు-ఘనముగనాకున్
సరగసమర్పించియునీ-విరవొందగకీర్తిగనుమ- యిహపరమందున్॥

కం॥ పాడుచు-నృత్యము సేయుచు-గాఢముగా-భక్తి సలిపి।
గరుడధ్వజునిన్ వేడుచు పరవశమొందుచు।
జూడగలిగెననుచుబడలి చొక్కెనయంతన్॥

తే-గీ॥ భక్తవత్సలు-డైనట్టి పరమపురుషు నార్తజనపోషు।
నజరుద్ర-యమరవినుతు డైనవరదుని-పదముల।
కలిముదమున మ్రొక్కి సేవించెనప్పుడు చక్కగాను॥

కం॥ పొందుగ్గదీర్ఘదండమిడి హోయెదనంచును లేచివేగమే।
సుందరుడైన శ్రీశునెద జేర్చుక సుస్థిరభక్తితోడుతన్।
సంపెపు తాళ-తంబురయు నట్టె కరంబునబట్టి గజ్జలున్।
సందడిసేయగా ఘనుడు- చక్కగ జెన్నపురంబుచేరెగా॥

కం॥ నిరతము పూజింతునుమది ।
కురువేరు ద్రవనంబులాది కుసుమంబులతో
పరిమళభాగయును గంధము ।
వరుసను శ్రీ వేంకటాద్రి వనజపదంబుల్ ॥

( సీసమాలిక. )



1. శ్రీవేంకటాద్రుల౯ చెలగునామముతోడ శ్రీకంచివరదుని సేవజేయ ।
2. మున్నట్టితిరిస్వప్న మందు భక్తాగ్రణి వైరముడిధరింప వాంఛగలిగె ।
3. చేయించుమాయని జెప్పగానేలేచి చెన్నారు గౌన్నపట్టమునకేగొచ్చి ।
4. కడుభక్తినుంచియు ఘనవైరముడియును కరకంఠసుతునకు గాపొనర్చి ।
5. ఉభయనాంచార్లకు నుత్తమమైనట్టి వైరముడులురెండు వాంఛజేసి ।
6. పుష్పకైంకర్యముల్ పాలుపొంగనొనరించి పురినుండు దివ్యదేశములయందు
7. జీర్ణించి యున్నట్టి జేజేల స్థానముల్ చెన్నొందగ యుద్ధారణంబుజేసి ।
8. వేదాధ్యయనపాఠ శాలవి ప్రాలితై మోదమందగజేసి ముఖ్యమైన ।
9. ద్వాదశిపారణ ధన్యులాపిప్పఁ)ల కనుగుణ్యముగజేసి కరముభక్తి ।
10. ప్రతిదినంబునురెండు పళ్ల క్షీరంబులు పక్వంబుగారాత్రి పదియురెండు ।
11. ఘంటలయందును గజరక్షకునకును గాంభీర్యతాయార్ల కర్పణంబు ।
12. జేసియువాసనల్ చెలగుకస్తురిపట్టు చందనకైంకర్య సమితిజరిపి ।
13. దీపప్రకాశులౌ దివ్యపెరుమాళ్లకు దినదినారాధన తీర్చుకొఱకు ।
14. దూళిమామందూర తోరంపుభూముల యయిదువేలకుదీసి యందువచ్చు ।
15. పైకంబులనుగొని పగలురాత్రులకును కైంకర్యములుజేయగానొనర్చి ।
16. యీరీతి వరదుని కివియెల్ల నర్పించి స్వప్నమనిద్రించు సమయమునను ।
17. శంఖుచక్రముగదా శార్ఙఖడ్గముదాల్చి సర్వాభరణ భూషితాంగుడగుచు ।
18. ఖగరాజుపైనెక్కి ఘనభక్తుడా వేంకటాద్రిని జేరియు విమలచరిత ।
19. నీవుముందొకయతి నియతి దాల్చెదవంచు నేనెరుంగుదుగాన నిపుడెయేగి ।
20. నీకిష్టమైనట్టి నిశ్చలచిత్తుడౌ నాచార్యుకడకేగి యతనివేడి ।
21. పంచసంస్కార తత్పరుడవుగమ్మని సెలవిచ్చియేగెనా శ్రీధరుండు ।
22. ఆవలయోచించి అల్లగియపుణవాళ జియ్యార్లవద్దకు చయ్యనజని ।
23. వరదునియాజ్ఞను వారికంతయుజెల్పి పాదములకుమ్రొక్కి ప్రస్తుతింప ।
24. ఆచార్యులప్పుడే యట్లుకానిమ్మని సంస్కారములుజేసి చెవినిజేరి ।

25. అష్టాక్షరీమంత్ర మపుడుపదేశించి ఆజ్ఞ యిచ్చెనపొమ్ము అతనికపుడు |
26. ననసేగి వరదుని నతిభక్తి గొలుచుచు చొక్కినిద్రింపగా స్వప్నమందు |
27. కనకాంబరుండగు కావేటిరంగడు ఘనశేషశయనుండై కాంతితోడ |
28. ప్రత్యక్షమై వేంకటాద్రి ప్రక్కనుజేరి పావననాకు పాండియనుకొండె |
29. జేయించుమనియన చెలగుచు నప్పుడే చెన్నపట్టమునందు జేరియంత |
30. దినమొక్కటికిపది దివ్యరూప్యంబులు దొరికిన భక్షింతు దొరకకున్న |
31. భక్షింపననియంతా ప్రబలప్రతిజ్ఞను జేసియార్జించి శ్రేష్ఠమైన |
32. నవరత్నములుగొని నయముగాపాండియన్ కొండెజేయనుసెంచి కూర్మితోడ |
33. కంసాలవానికి కరమొప్పగానిచ్చి చేయుమనంచనవాడు చెనటియగుచు |
34. నదువాయకపుపణ్ని నహితుడై దొంగిలి వేరుపచ్చనుగూర్చ వెతకిరేగ |
35. రంగనాయకుడప్పు రమ్యంపు పచ్చను చూరనున్నదియని మాపెకలలో |
36. యపుడె దిగ్గునలేచి యన్యులగుర్చుక యాకాశిదాసింటికరిగివారు |
37. కారిన్యుడైనయా కంసాలవానిని కాంచిపచ్చనుజూపు కాంచవలెను |
38 ముంచిపచ్చనుదాచి మాందాళిపచ్చను మాపియదేపచ్చ చూడుమనగ |
39. యపుడు దిగ్గునలేచి యాచూరచెక్కిన పచ్చనెత్తుకజూపె పరిజనులకు |
40. వారుకంసాలిని వదలక దూషించ పాదముల్ బట్టుక భయముతోడ |
41. నానేరములుగాచి నన్ను మన్నించుడీ నయగుణులారయ జ్ఞానినైతి |
42. ననసపరాధ మేర్పరచియా ముచ్చను నాజ్ఞయిచ్చియుకొండె నయతరముగ |
43. చేయించుకొని చెన్న-పురియొల్ల మేళతా-ళములతో మెరవణి మెచ్చజేసి |
44. అపాండియన్ కొండె అచ్చటికి గొంపోయి ఆదిరంగని కర్పణంబొనర్చి |
45. చెన్నగునుభయ నాంచార్లకు రత్నాలు పొదిగించి జతకిరీటములుజేసి |
46. అర్పించికైంకర్య మాదిగా నొనరించి అవనిసద్భక్తులానందమొంద |
47. అనిశయందున అమరనుతుండగు రంగనాధుడు స్వప్నమందుజేరి |
48. మహితాస్తుడానాకు మకరకంఠియొనర్పు మనిజెప్పినమునైన మాత్రిలోన |
49. చెన్నపట్టమునందు చెతురత తోడను శ్రేష్ఠముగానది జేయుచుండ |
50. నెల్లూరిరంగని నేమనమాగానె దివ్యవిమానంబు తేజరిలగ |
51. పైడిగిల్టొనరించి పంచకలశంబులబాగావిమానంబుపైనమర్చి |
52. బ్రహ్మోత్సవముజేసి ప్రబలమాతదిరపారాధనల విప్రాళికితగనొనర్చి |
53. నెల్లూరిరంగని నేత్రోత్సవంబుగా వీక్షించిపాదాబ్జములకుమ్రొక్కి |
54. చెన్నపట్టమునకు చయ్యనజనుదెంచి నిద్రించునట్టియా నిమిషమందు |
55. తిరువడందెనునుండు తేజోన్మయుండగు నిత్యకల్యాణుండు నేగుదెంచి |

56. భక్తాగ్రగణ్యానా భవ్యవిమానంబు ఖిలమయ్యె నయ్యెయోకీర్తిసాంద్ర।
57. చేయించుమనియాజ్ఞ జేసినయంతనే వేంకటాద్రులు వెళ్లనేగలేచి।
58. తిరువడందెకునేగి దివ్యవిమానంబు నూతనంబుగజేసె నొప్పునట్లు।
59. చూచెడువారలా శోభగును మెచ్చుచు వేంకటాద్రులకీర్తి వేవిధముల।
60. పొగడుచునుండగా పాలుపొంపధక్షుందు మహాబలిపురమును మమతతోడ।
61. దర్శింత్సవలెనని ధన్యుడచ్చటనేగి స్థలశైనపెరుమాళ్ల దాపుజేరి।
62. నుతులువేయునుజేసి నొప్పారుతీర్థప్రసాదముల్ గొనియాల యంబులోని
63. సర్వాఖిలములనెల్ల చక్కగాశోధించి మకరకంఠిని దలచి మాన్యుడపుడు।
64. చెన్నపట్టమునకు చేరివేగముతోనె చెన్నగుకంఠిని చేతబూని।
65. అద్దెపుపెట్టెలో ననకువగానుంచి మేళతాళధ్వనుల్ మిన్నుచెలగ।
66. పట్టమంతయుజుట్టి పరమేష్ఠిజనకుడా శ్రీరంగనాథుని చేరబోయి।
67. మకరకంఠినినొక్క మందసంబుననుంచి భద్రంబుగానందు పదిలపరచి।
68. బహుపరిజనములు బాటసారులుజేరి పట్టముల్ పరగణాల్ భద్రముగను।
69. దాటిశ్రీరంగని దాతదగ్గరజేరి దర్శించికీర్తనల్ తగనొనర్చి।
70. మకరకంఠియురంగ మహితునకర్పించి శ్రీరంగనాయకిజెప్పినట్లు।
71. రత్నముల్ చెక్కిన రాజముడియొనర్చి తిరుపళాతురయను దివ్యమైన।
72. గ్రామంబు నందున్న గంభీర భూముల గైకొని యటవచ్చు ఘనధనమును।
73. సంధ్యకాలమునందు సాయుజ్యరంగని సత్ శ్రేష్ఠమా సన్నిధానమందు।
74. తిరుమాల్ వడలు అప్పం తిరుపణ్యారంబులు దినదినమర్పింత్రు దేవునికిని।
75. బహుకాలముగనుండి ప్రబలశ్రీరంగని రాణికిప్రతిదిన రాత్రియందు।
76. లవణరాహిత్యమా లఘ్వన్నమిడుచుండ గని వేంకటాద్రులు కళవళబడి।
77. ధర్మకర్తయుమొదల్ ధన్యాత్ములయిది మేరగాదని దెల్పి మెచ్చునట్టి।
78. సట్ట్యరవణసాదం-స్వామికీయిదునట్లు తాయార్లకిడుటయు తగినదనిన।
79. అచ్చటనున్నయా యఖిలజనంబులు- యానందమొందుచు అపుడెతమదు।
80. సన్నిధిలెక్క-లో సమకూర్చివ్రాసిరి శాశ్వతముగనిది జరుగునట్లు।
81. దెల్పిజరిగించిన దేశికోత్తమునకు · దివ్యదేశములెల్ల తిరిగిచూడ।
82. నకాంక్షజనియింప-నానాటినిశియందు రంగనాథునిజేరి రమ్యముగను।
83. ఓదేవ-దేవేశ యోకృపాజలనిధే- యోకమలేన్వ-యడిగెదను-త్వామాప్పతోడ।
84. ఊపిరున్నంతలో నొగిదివ్యదేశముల్ జూడనాజ్ఞయొసంగు సుస్థిరముగ।
85. యనుచు నంజలిజేసి యుత్తరినొడబాసి వేంకటాద్రులుజనిరి వేగనపుడు।
86. తిరుకోవలూరాది దివ్యదేశంబులు ఆళ్వారుసన్నిధు లన్నివరుస।
87. నరిగిసేవించుచు నానందమొందుచు తిరుమాలిరుంజోలె క్షిప్రముగను।

88. చేరి శక్లశిగరు చరణారవిందముల్ సేవించి గొన్నాళ్లు చిత్తమలర ।
89. నాదివ్యదేశపు యుగళిత స్వర్ణవిమానంబుఖిలమైన మహితభక్తి ।
90. శ్రీమంతులగువారి జేరియాచించియు వారిచ్చుధనముల బాటముగను ।
91. నాయూరనుండిన యధికారివద్దను జేర్చుచునుండెనా శ్రేష్ఠుడపుడు ।
92. అవిమానముజేయ నారంభమునుజేసి లెక్కజూపగఁగొంత తక్కువైన ।
93. తక్కినద్రవ్యంబు తెమ్మని యడుగగా వేంకటాగ్రులనువా డెంచకుండ ।
94. అవహాస్యములుజేసి యట్టెదూషించిన నయ్యగారికి కోపమగ్గలముగ ।
95. సత్యార్థుడనిరొంచి । సమమూర్తితిని గాని స్వామిసొత్తపహరిం-తువనియెరుగ ।
96. అపహరించియునన్న । హాస్యమాడితివిగా నీయింటపడుపిడుగు నిమిషమునకు ।
97. అనిబల్కి తిరుగగా నట్టెయు ధ్యాహ్నంబు । నంమనాతనియింట నశనిబడియె ।
98. నాపద లెవ్వరి నందకుండగబోయె నపుడు కీర్తించిరి యయ్యగార్ని ।
99. నావిమానముజేసి యమరులు మెచ్చగా-నత్యున్నతంబైన యట్టిదాని ।
100. కాంచన మయముగా ఖద్యోతుని ధిక్క-రించి తేజముమింట మించిప్రాకె ।
101. వేయించి బుధవరుల్ చిత్తంబు వికసింప జూచువారలకు సం-భ్రమజనింప ।
102. కళ్లిగరుకిట్టి ఘనవిమానంబును చేసి సత్కీర్తులు జెందిపిదప ।
103. శ్రీరంగనాధుని సేవింపమదినెంచి తత్క్షణంబునరంగధామమరిగి ।
104. శ్రీరంగనారాయణ జియ్యర్లయాజ్ఞచే శాశ్వతపరమహంస స్వరూపు ।
105. రమ్యతిర్వేంకట రామానుజ జియ్య-రనునామమువహించి రమ్యమైన ।
106. కాషాయమూత్రిదండం కరమొప్పగధరించి కనకాంబరునిసేవ-క్రమముగాను ।
107. చేయుచుండినయట్టి జేజేలసమునకు ప్రియశిష్యుడౌ పైడిపాలగోత్రు ।
108. పుష్పాలరామదాస్ ఘనిసెన్న సక్కుబాయ్ పుణ్యచరిత్రంబు పూర్తిగాను ।
109. శార్దూలవృత్తముల్ చదిగల్గి జెప్పితి శబ్దలక్షణములకా సరణిసెరుగ ।
110. అమరనిఘంటువుల । న్నమరజూడగలేదు శాస్త్రవ్యాకరణముల్ చదవలేదు ।
111. చందస్సులక్షణాల్ చర్చింపగాలేదు నవరసాలంకార న్యాయమెరుగ ।
112. ధ్యానమంతయునునా దాశరధినిజేర్చి దాసులపాదముల్ తలనుదాల్చి ।
113. నట్టినా కవి వరు-లాపండితులుగూడి తప్పులెంచక మిగుల తాల్మితోడ ।

( పంచపాదిగీతము )

తప్పులుండినదిద్దినా తప్పుగాచి
పూజ్యునిగజేసి ఘనినసీ పుణ్యచరిత ।
నెంతకాలము చంద్రసూర్యాదులుండు
రంతకాలమునుండనాశీర్వదింతు
రనుచు కేల్మోడ్చి మ్రొక్కెద యనఘులార ॥

కం॥ శ్రీవేంకటాద్రిజియ్యరు సేవకుడను శిష్యవరుడ చెలువొందన్నన్ ।
గావనుకరుణానిధియిటు। రావే పుష్పాలరామ రాఘవనామా॥

ఆ-వె॥ నాగశయననన్ను నాదరించకయున్న ।
భాగవతులముందు పట్టియీడ్చి।
వేగనాదుమొఱలు వినుపింతు పుష్పాల
రామదాసవినుతరమ్యనామ॥

కం॥ హరిహరియని నినుబిలిచితి। విరబిరనను బ్రోవనీకుబిగువేలగువేల।
పరిపరి విధముల వేడితి। మురహరి పుష్పాలరామ మోదితనామా।

శా॥ ఎన్నో మార్గములన్ నినున్ గనుటకై యిందాక నే జూచితిన్ ।
గన్నంవేసెడు దొంగకైన మిగులన్ కారాని దొంగైతివే ।
మున్నే గోపికలందరు న్నుడివిన న్మార్ధుండనై గొల్చితిన్ ।
పున్నెంబౌనిక నన్నుబ్రోవు విఠలా పుష్పాలరామప్రభో ॥

(కీర్తన) రాగం నాదనామక్రియ ఆది.

ప॥ హరినారాయణ గోవిందాయను అచ్యుతనామమిఠాయీ

అ॥ హరవిధిసురమును లనుభవించున-త్యద్భుతమైనమిఠాయీ॥ శ్రీహరి॥

చ॥ ఆదిశేషుడును నార్యకోటులును నారసి దిన్నమిఠాయీ ।
సాధుసజ్జనులందరు సతతంబును సన్నుతించుమిఠాయీ॥ శ్రీహరి॥
పంచామృతమును పనసతొళలకును పక్వమైనమిఠాయీ।
రొంచరానిసం చితకర్మములను ద్రుంచివేయుమిఠాయీ॥ శ్రీహరి॥
మనుమాంధాతలు మహరుషులును మన సారభుజించుమిఠాయీ
ఘనులౌ గోర కుంభారుదాసులను కడతేర్చినమిఠాయీ॥ శ్రీహరి॥
శుకనారద భీష్మాదులు తినిబహు-చొక్కు-చునుండుమిఠాయీ ।
సుక జననమురా నియ్యకజేయును వికసితమైనమిఠాయీ॥ శ్రీహరి॥
భరత శౌనకా పరిక్షిత్తులిల బాగుగదినిన మిఠాయీ ।
వరవాల్మీక వసిష్ఠ పరాశరు లిరవుగదిన్న మిఠాయీ॥ శ్రీహరి॥
వ్యాసకౌసికా గస్త్య గౌతములు వాంఛించినమిఠాయీ ।
దాసహృదయములనాశరహితమై। వాసముసేయుమిఠాయీ॥ శ్రీహరి॥
పుండరీకబలి విభీషణాదులు పొగడుచునుండుమిఠాయీ ।
కొండపీటిజంగము పార్వతికిని కూర్మినొసగినమిఠాయీ॥ శ్రీహరి॥

హనుమకస్యపాం బరీషవరదులకు నతిప్రియమైనమితాయీ ।
జనకచక్రవర్తియు జయదేవులు జయమొందినమితాయీ॥ శ్రీహరి॥
సనత్కుమారులు ప్రహ్లాదుండును సదాభుజించుమితాయీ ।
మునురుక్మాంగద కుచేలాదులు పెనగొనిదిన్న మితాయీ॥శ్రీహరి॥
కలిహతకర్త బాయీ-మీరాబాయిముక్తా-బాయిభుజించుమితాయీ।
జ్వలితకీర్తిజనాబాయి సక్కుబాయి సన్నుతించుమితాయీ॥శ్రీహరి॥
అండ పిండ బ్రహ్మాండంబులకాధారమైనమితాయీ ।
నిండుభక్తితో జడభరతుడుమును నెమ్మిగదిన్న మితాయీ॥శ్రీహరి॥
ధరపుష్పాలరామ దాసులనందరిని దరిజేర్చగలమితాయీ ।
స్థిరమతి నమ్మిన భక్తులకిష్ట సిద్ధియైనమితాయీ॥ శ్రీహరినారాయణ॥

కం॥ రామాయని నేబిలచిన నేమీయనిబలుకరాద యిదిమర్యాదా
కామ జనకయికవాదా స్వామీపుష్పాలరామ శాశ్వతనామా॥

శా॥ చంద్రాధీశుని పాదపద్మములుచే బాగగబట్టిమాలింగనం ।
నిండారంగ జేసివేడుకొనుచున్ నిత్యంబుసేవించగా ।
చెందున్ పాపములన్నియు న్నిజముగా చర్చింపనింకేలనే ।
సుందర్ నీకు భయంబులే దనెదుయో పుష్పాలరామప్రభో ।

(కీర్తన) హిందుస్తాని కాపిరాగం - ఆది.

ప॥ రామా రామ-రామా యోసీతా రామా॥ దివ్య-
అ॥ నామా నతజన ప్రేమా నన్నేలుమా॥ రామా॥ (1)
చ॥ నమ్మా-నానిటు రమ్మా-భవములజిమ్మా ।
నన్నేలు కొమ్మా కోర్కెలిమ్మా॥ రామా॥ (2)
నాథా యికను నామీదా నీదయ రాదా ।
నినునమ్మ లేదా మర్యాదా॥ రామ॥ (3)
ఏలా యీచల మేలా పు-ష్పాలా ।
రామదాసుని-నేల య్యీవేళా॥ రామా॥ (4)

శా॥ ఏపాపంబులు జేసినానొ మునునే నీకష్టముల్ జెందగా ।
నాఫాలంబున వ్రాలుయిట్టులగుట న్నంచాత్మజావిఠ్ఠలా ।
కాపాడంగల వాడవీ వనుచునే-కాంతున్ నిన్నుంగొల్చితిన్
భూపాలాగ్రణి నన్ను బ్రోవు-కరుణన్ పుష్పాలరామప్రభో॥

శా॥ యెంతో వేడుక జూడనాయెనుగదా యీజ్ఞానదేవేశ్వరుల్ ।
వింతౌదున్నను భూజనుల్ బొగడగా-వేదంబు జెప్పించెగా।
యంతేగాకొక సిద్ధవర్యునెదుటన్నాగోడనిడ్పించెనీ।
పొంతన్జేరితి విఠలా యరుదెరో పుష్పాలరామప్రభో।

(కీర్తన) కమాసురాగం - ఆది.

ప॥ ఏమయ్యా-రామయ్యా-న-న్నేలను-నీవిటు-రావయ్యా ॥
అ॥ తామసించినవిననయ్యా-తడవేలనుబ్రోవవయ్యా॥ (1)
చ॥ ఎంతనీ వినుతింతూ-యెవ్వరినే।వే-డను-ధరనూ।
సంత-రింపక-నినువిడనూ।యిది-సమయమునను గా-వగవలెనూ-ఇది-ఏ॥
శోధనా-సేయకుమీ-నాథానాయడ-తప్పేమీ।
శ్రీధర న్యాయము గాదు సుమీ । అతి
శీఘ్రముగానీ।విటు రమ్మీ యిగ-ఏమయ్యా ॥ (3)
చాలునూ చాలునూ చలముజేసిన తాళనూ ।
పు-ష్పాల-రామ దాసుడనూ। నను
పాలింపకనిను పోనివనూ- యిది-ఏమయ్యా ॥ (4)
కం॥ ధరణీసురనుత నీశ్రీ-చరణాంబుజ యుగళరేణు సంస్పర్శమునా
దురితముల బారదోలును ధరపై పుష్పాలరామ- తారకనామా॥
జావళి పో-పొమ్మనే పొమ్మనే భామరొవాని అనుయీ వర్ణమట్టుగా.

—<>—

(జావళి) కమాసురాగము-ఆది.

ప॥ రారా పండారినాథా రాధా వినోదా॥ రారా॥
అ॥ మారజనకవాదా మహిలోనా ప్రాణనాథా॥ రారా॥ (1)
చ॥ ఘనకాంచనచేల- ఖగగమన గోపాల- మనివి-వినిశ్రీలోల।
మరువకుమీవేళ-రారా॥ పండ్హారినాథా॥ (2)
చ॥ మోసబుత్సకుశ్రీశ మునిహృదయని వాస దాసు ।
దుఃఖవినాశ దరిజేర్చ జగదీశ-రారాపండారి ॥ (3)
శ్రీశ పుష్పాలరామ దాస వినుతనామ ॥
దాసదాసుడ సుమ జరిజేర్చు ముఖసోమ-రారా పండారి ॥ (4)

శా॥ రక్షా-మాధవ రాముర్రాంతకహారి రాపాండురంగాదయన్ ।
యిక్షా-కోరిన కోర్కెలెల్ల నిపుడే-యీకున్న నియ్యానసే ।
మిక్షునట్లురిలోన నీడ్చియునునే నీమానముల్ దీయుదుర్ ।
బొక్షన్రక్షణజేయలేదె తొలినో-పుష్పాలరామప్రభో ॥

శా॥ పాషాణంబైయున్న గౌతమసతిన్ పాదంబులున్ మోపియున్ ।
నీసారూప్యము జూపిబ్రోచితివిగా-నిన్నేను ప్రార్థించగా ।
శ్రీశాయింతటి క్రూరమా కఠినుడా'చితెంబునన్ దోచదా ।
హోసర్వేశ్వర రంవెబ్రోవ కరుణన్ పుష్పాలరామప్రభో।

(జావళి) యేమిసేతు యెటులసైతు మరులుతాళలేనురా సామీ ,
అను వర్ణమట్టుగా- కమాసు (జావళి) రూపకతాళం.

ప॥ స్వామిపాండు-రంగనాథా- సా-మా-గా-నావినోదా-స్వామి(1)
అ॥ యేమితోచ-దేమి సేతు-నెటుసహింతు- నికమీదు-స్వామీ॥ (2)
చ॥పన్నగా-శయనసుప్ర-సన్న-చంద్రా। వదన-నా-విన్నపమూ। వినా
కున్నా విడువానిన్ విశ్వమునా॥స్వామి పాండు (3)
కుంతైన నీ-దయరాదా-సుందా రా మృదుపాదా యెంతవేడినవాదా
యే-మా-నా-వృా-మర్యాదా- స్వామిపాండురంగనాథా॥ (4)
నామొఱవినీ-పుష్పాల-రామదాసునీ-యీవేళ-ప్రేమతో-రక్షించు
శీల-తామసింప।కా-గోపాల॥స్వామిపాండు-రంనాథా॥ (5)

శా॥ మంకేలాయిక-వేంకటాద్రులకునీ। మర్మంబులంచెల్పగా-
శంకన్ జెందుదువంచు-జింతిలుచునే। జెప్పంగలేకుండనీ-
బింకంబుల్ తగజేయనీకుఁదగునే। బీభత్సమిత్రాయికన్-
పొంకంబాగద।గాచినన్-న్విఠలయో-పుష్పాలరామప్రభో ॥

కం॥ ఏమోవీడొనరించ। బోవుననుచు।న్నే మాటినీ-వుండకే
నామీదన్ గృపయుంచితే । స్థిరియిక-న్నారాయణా-విఠ్ఠలా
సామాన్యుండటె వేంకటాద్రిగురు। స్వాముల్నిను-న్నిడ్చియా
భూమీశుల్ గన।బుద్ధిచెప్పనుగదా-పుష్పాలరామప్రభో॥

శా॥ నాశిష్యుండిత।డంతరంగముననీ। న్నానాటికిన్గొల్వగా
గాసింబెట్టుట-నీకునీతియవునా - కారుణ్యవంతుడవై

యాశుండై యిటుజేయనీకు-దగునె। నిందాకనేనోర్చితిఁ
నోర్పిమింపందగునంచునిన్ను। నడుగుదు-పుష్పాలరామప్రభో॥

(కీర్తన) సామరాగం-చాపు.

స్వామిశ్రీపం-ఢరీనాథా-సామగా-నవినోదా- కామజనకా-కావాగ
రాదా-నా-ప్రాణా-నాథా।మోమయినజూ-పవూ-శ్రీనాథా॥స్వామిశ్రీ,
రాధాశ్రీరు-క్మిణీనాథా మాధవా-హరిగోవిందా-ఆదరించు-మంబుజ
పాదా-పం।డరీనాథా బాధదీర్చ-నాతోనువాదా॥ స్వామిశ్రీ, (2)
యోగిమా-నసా-సదనా భోగిభో-గ-శ।యనాయేగతిజే-సేదవో-నేగా
ధా,శ్రీమ-న్నారాయణా- సాగిటురా-రా-చంద్ర- వదనా-స్వామిశ్రీ, (3)
తామరాకూ-పైసీ నీరూ-తల్లడిల్లు-నట్టితీరూ, భూమినీబాధ-బడా-ఛలే
మారూ-స్వామినన్న వేరూ-సేయకబ్రో-వ-ట- క్కే-వ్వారూ-స్వామిశ్రీ,
సామజపా-లా-జా-గేలా-చాలనష్టి-న-పు-ష్పాలా- రామదాసుని-
రక్షించవేలా,వో-రంగా। ఈవేళా-రమ్మురా-జసా-మింకేలా॥స్వామిశ్రీ॥

కం॥నరహరి-నసునికబ్రోచుట-కరమరసేయంగనేల-నా వుడనసుచుఁ।
గరమునిసు-దినమువేడెద-మఱువకు-పు-ష్పాలరామ-మానితరామా॥

చం॥ పరమ-పతివ్రతా-మణియు-భర్తను-దైవమటంచు,నెంచియే। సర
గునగొల్చునో-యటుల-స్వామియు సద్గురు-వీవటంచునే। స్థిరమ
తిగొల్చుచుందునతి। తీవ్రముగానను-బ్రోవవయ్యయో।వరకరుణా
కరా।సుగుణ-వర్ణిత పుష్పాల-రామరాఘవా ॥

యెమునాకల్యాణి (కీర్తన)తిశ్రలఘువు తాళం.

ప॥ పాండురంగా-పలుకవే భవ-హరణ-హరణ-హరణ-హరణ॥పాండు॥

అ॥పాండవపరి-పాల।యికను।తాండవమూర్తి-దయజూడుమను-
ధరను-ధరను-ధరను-ధరను॥ పాం॥ (1)

నారదాది-వినుతపాదా- పారాయణ నాతోవాద-వరద- వరద
వరద-వరద॥ పాం॥ (2)

సామగాన-శ్రవణలోల - సమయమిదియే- బ్రోవవేల- విమల-
విమల-విమల-విమల॥ పాండు॥ (3)

కాము-జన,కా,పుష్పాల-రామదాసుతో-వాదేల-యీవేళ-యీ
వేళ,యీవేళ-యీవేళ॥పాండురంగా,పలుకవే॥ (4)

కం॥ నిన్నే నమ్మినవాడను-బన్నగశయ।నామదీయ-బాధలనడపన్।
దిన్నగనిటురమ్మామునిసన్నుత-పుష్పాలరామ- శాశ్వతనామా॥

కం॥ హీనులగొల్వగజాలను-మానుగనిను-నమ్మినాను- మాధవరామా।
నేనెటులోర్తును-శ్రమలను- దీనుడపు-ష్పాలరామ-దీపితనామా॥

శా॥ కడుబాలత్వమునన్ - ధ్రువుండుగనేసిన్ । కైవల్యమున్ జెందెగా
ఇడుమల్ జెందుచు-వెంకటాద్రిజియరుల్।యిష్టుండయోన్ మీకురే
తడవున్ లేకనె-చంద్రగోరకులును-ష్టార్థంబులున్ జెందిరే-
యుదురా-జాజ్ హే-విఠ్ఠలా-యనిగదా-పుష్పాలరామప్రభో॥

జంఝూటి నొండిచిందు (కీర్తన) యేకతాళం.

ప॥ పండరిపురనాథా। నీ। దండజేరితిని వే-దండవరదా॥

అ॥ దండిదాతవుగాదా।యమ। దండనబాపుమీ।ధరమీదా॥ పం ॥ (1)

చ॥పాండవ।కులతరణా।బ్రహ్మాండచరాచర-భవహరణా। తాండవ
శ్రీకృష్ణా।మా।ర్తాండతేజ-మం-దరధరణా॥ పండరి॥ (2)

మనవి-వినవదేరా।దివ్య।మణిమయజ్వలితా-మకుటధరా వననిధి
గంభీరా నీదు-వనజచరణసేవ వరములీరా॥పండరిపురనాథా। (3)

ఘనమేఘసంకాశా; దివ్య। కనకవసనశ్రీ కమలేశా దనుజాధిప
నాశా।నీ।దయజూడుము।దశవిధవేషా॥ పండరి॥ (4)

ధారయా-పరంధామా।యీ।ధరనుపుష్పాలరామ- దాసునేలు
మా-సురనుతముఖసోమా శ్రీ-కరుణాకర కా- రవభీమా॥ పండరిపుర
నాథా॥ (5)

శా॥ సనకాదుల్-జయదేవచిద్ఘనులునా-సామంతగాజ్-నాందేవ్।
ఘనఖట్వాంగు-లజామిళుల్-గుహుడునో- కంసారి హే-విఠ్ఠలా।
నిను సేవించిగదా-పరంబుగనిరే-నీకూర్మదాసాదులున్।
పునరావృత్తులు-లేక-మానుననియో- పుష్పాలరామప్రభో॥

కం॥ నాదుపుట్టువులను-నలువకైనగణింప। నాదునానియేల। రవ్వభువిని
నీదురూపు।జూపునిర్మలపుష్పాలరామ।సుగుణధామ। రమ్యనామా॥

శా॥ భికయాలనే। వానితో నృత్యయించుముఖ। చాలునే-అనువర్ణమట్టుగా

రాగముజంఝూటి (జావళి) చాపుతాళము.

ప॥ ననుగావరా పాండురంగా నినునమ్మున్న నే నీధరా॥ నను॥ (1)

అ॥ మునుభక్తులబ్రోచినధీరా।నా-ముందిటు రారవో-శ్రీధరా॥నను॥ 2)

చ॥ పంకజదళనయనా శంకరప్రియ చం-ద్రావదనా॥ నను॥ (3)

ఘనమగు కాం-చనచేలా।నా।మనవినివినిరా-యీవేళా॥నను॥(4)

ఆగమనుత అం-బుజనేత్రా-న-న్నగతిచేకొవా నెరుగనురా॥న॥(5)

సామజపాల పుష్పాల రామదాసుతో రంపేలా॥ నను॥ (6)

శా॥ యీపైజెప్పిన యట్టిభక్తులవలె న్నేగానయో।విఠ్ఠలా।

యేపాపంబులు జేశినానినుచున న్నిట్లారడి న్బెట్టెదో।

నీపాదాంబుజముల్ సదాగొల్చితిఙ నీతిఙ విచారించినఙ।

భూపాపక్షయ చూడరాదె కరుణఙ పుష్పాలరామప్రభో॥

శా॥ పాకారిస్తుత విఠ్ఠలా పరమప్రావీణ్యుల్ ఘనుల్నామదేవ్।

రాకాబాయియు।నే కచిత్తజనబాయి రామ।దాసాదులుఙ।

చౌకామీళను సేననావియునునా సత్యాత్మునాబాజియుఙ।

భూకామాయనివేద బ్రోచితివిగా పుష్పాలరామప్రభో॥

ఇన్నాళ్లవలెగాదే - అనుజావళి వర్ణమట్టుగా.

రాగము - నాధనామక్రియ (జావళి) యేకతాళము.

ప॥ ఈబాధ।కెట్లోర్తునూ। యీశ్వరనేనూ। యీభువిలోనూ। యీ బాధకెట్లోర్తునూ॥ ఈ॥

అ॥ గోపాలమ్రొక్కెదను-కాపాడరారనను నీపాద।సాక్షిగను-నిజముగతాళలేను॥ ఈ॥ (1)

చ॥ పంకజదళనయన- పన్నగవైరివాహన-యింకశోధింపతగునా - యీయిలలోన-పంకముతోడుతోనునా। సంకటముదీర్చుమన్నా-వెంకటరమణనా-వెతదీర్పనురాకున్నా॥ ఈ॥ (2)

• పరమదయాళువనీ-భక్తులచేనేనువినీ శరణనేజొచ్చితినీ సంతరింతువనిపి బిరుదేడనోగాసి- వరదకరుణమానీ తరుణమిందునవినీ దరిశేరుక్షుక లేనీ॥ ఈ॥ (3)

ఆశతో పుష్పాలరామదాసుని దరిజేర్చుము। మోసము సేయకో
కుమ-మోక్షదాయకవినుమ। కోసలపట్టణరామ-కోర్కెదీర్చపరంధా
మ-గాశిబెట్టుట-ఘనమ కాకుత్స్థకుల సోమ॥ ఆ॥ (4)

శా॥ శ్రీరామా యని రామదాసు మతియుం శ్రీవిఠ్ఠలా యంచునా।
ధారుండంచును రామరాజును మహాధన్యాత్ములో లింబరాజ్।
శ్రీరాధాపతి యంచు సంతోబయును శ్రీశంక్రి బాఖాజియుం।
బోరేనీపదముం గనంగ విగలరో పుష్పాలరామప్రభో॥

శా॥ కుర్రాతుండవటంచు నే తెలియకన్ కూర్మి న్నుతుల్ చేయగా।
నారానాసరివారు నవ్వెదరుయూ యన్యాయముంగల్గునే।
శ్రీరాధామణితోడ జెప్పకొనినన్ శిక్షించెదన్ జూడుమా।
పోరామింతయు జేతుగా విశలరో పుష్పాలరామప్రభో॥

జా॥ పా। పొమ్మనే। పొమ్మనే - అనువర్ణమట్టుగా బాడవలయును.

రాగము కమాసు (జావళి) ఆదితాళము.

ప॥ రారా। పండరినాథా। రాధావినోదా॥ రారా॥
అ॥ సారస। దళపాద సామ గానవినోద॥ రారా॥ (1)
చ॥ ఏమిసేతుయీబాధా కట్లోర్తు భువిమీదా। స్వామిదీర్చగరాద।
చాలావేదద॥ రారా॥ (2)
మకరకుండల భూషా మాని మానసోల్లాసా - ఇకవాదేలను
శ్రీశాయిభరా- జపోషా॥ రారా॥ (3)
నీలమేఘ శరీరా నిగమగోచరధీరా జాలము సేయకురా జగ
తోద్ధారా॥ రారా॥ (4)
శ్రీశపుష్పాల రామ-దాసవినుతనామ మోసము సేయకుమ మో
ముజూపుమ॥ రారా పండరినాథా॥ (5)

(జావళి) వలచితే యింత। చలమేల। రారా। సామి అనువర్ణమట్టుగా

కమాసురాగము (జావళి) మద్యాదితాళము.

ప॥ పాండురంగా పక్షముతో పాలించుపశి। బాలుని నేడు॥ పాం॥
అ॥ ఛాంఛాళుం।డనకనన్ను సారసాక్ష।దయజూడు॥ పాం॥ (1)
చ॥ కోమలమేఘశరీరా కోటిమన్మథలంకారా। కామసము। సేయకురా

జా॥ ఇందుముఖి వానికి మన-సింధు లేదాయా అనుసర్గమట్టుగా,

బ్యాగురాగము- (జావళి) రూపకతాళము.

ప॥ సుందరశ్రీ।రాధా కృష్ణా। యిందురావేరా ఎ॥

అ॥ మందర గిరిధరా నాతో।మాటలాడరా మా।ధవనాతో పోరా-వో॥

చ॥ వందనములు।జేశెదనో। విం।వరమిరా యెందుకు।యింత కోపము। యేలర ధీరా। వో।సుంధరాకారా।సురమునిమనోహరా।నా। యంచేమలుకరా॥ వో॥ సుందరశ్రీ॥ (2)

నీరజ దళ లోచనవో।నిగమ గోచరా। మూరజనక నేర మెన్నక నేనీవాడరా నా వరము లొసగరా నే నినువిడువనురా నెనరుంచు సుధీరా॥ వో॥ సుందరశ్రీ॥ (3)

ఎంత వేడుదు। యికనీమతి సుం।గైన కరుగ నా పంతము సేయక నే పశి। బాలుడగాదా।పా లింపగ రాదా నాతోనిక నాదా నమ్మియుండలేదా॥ వో॥ సుందరశ్రీ॥ (4)

మేరుసమగం।భీర నన్ను వేరుసేయకా ధారుణి పు।ష్పాలరామదాస పోషకా। నా।మొఱ విను నాయకా। మోసానిక సేయకా।మోక్షప్రదాయకా॥ వో॥ సుందరశ్రీరాధా॥ (5)

శా॥ ఎంచ్చంగా। దగునయ్యపెద్దల-నినుఁ। న్నే మంచు నా।గోపికల్
పంచాగ్నుల్ వలె మూరు బాణములచే బాధల్గాము।ఁజెంది ఘో
వంచా।దిక్కి-క లేరు। నీవెగతిరా వేయంచు బల్కాఅఁగా
పొంచేయుంటివిగాక నిర్దయుడవై పుష్పాలరామప్రభో॥

శా॥ జన్మంబుల్ మఱి యెత్తలేను జగతిఁ సర్వేశ చాలింపుమా
సన్మానింపగ నీదుపాదయుగముల్ తప్పకంగనా కండ్లతో
అన్మానంబును లేక జూపుమనుచుఁ అర్థినినుఁ వేడితిఁ
ముఁమ్ముఁ బోయిన పోక లెన్ని కుసుమీ పుష్పాలరామప్రభో॥

జా॥ఇక రోజాలనే!వానితోను యిందు-ము-ఖి-చాలునే-అనుసర్గమట్టుగా,

రాగము జంఝూటి (జావళి) చాపుతాళము.

ప॥ ఏమిసేతునూ పాండురంగా యెటులోర్తునుయీ-బాధనూ॥ ఏ॥ (1)

అ॥ స్వామినేనూ జాలినానూ భూమిలోనిక బుట్టగలేనూ।ఏ॥ (2)

చ॥ పన్నగశ। ల్పాశయశ్యా క్రన్నన నన్ను। గావకున్నా వేమి॥ (3)
శంఖ। చక్ర। ధర। బిరనా।సంకటములు।దీర్చ్చను యికనూ॥ ఏ॥ (4)
పంకజదా।శ। నే।త్రా।శంకరప్రియ। సుగుణమిత్రా॥ ఏమి॥ (5)
సామజపాల। పుష్పాల రామదాస। పరిపాల॥ ఏమిసేతునూ॥ (6)

శా॥ చొక్కాబాయియు కర్మబాయి శబరీ శుభ్రాంగిగో మాయియర్!
దిక్కే నీవని ప్రస్తుతించు గిరిబాయ్ ధీరేణుకానందబాయ్।
యిక్కాంతామణులేమి నీకునిడిరో యేనివ్వనౌనామదిన్।
పొక్కంజేయకగావు వారివలెనే పుష్పాల రామప్రభో॥

శా॥ పరమపతివ్రతామణియు భర్తనుడై వమటంచు నెంచియే।
నరగున గొల్చునోయటుల స్వామియునద్గుణ నీవటంచునే।
స్థిరమతితోడగొల్చితిని తీవ్రముగానను బ్రోవవయ్యయో।
వరకరుణాకరాసుగుణ వర్ణిత పుష్పల రామరాఘవా॥

ఇక యేలా హోహోహొమ్మనవే అనువర్ణమట్టుగా.

జంఝూటి (జావళి) మద్యాదితాళము.

ప॥ విఠలా నిన్ను నే-విడువనురా వో విఠలా నిన్ను నేవిడు-
వానూరా వో విఠలా నిన్ను నేవిడువనురా విడువనురా॥

అ॥ భటుని పాలింపరారా పంత మేలర సూరా కఠినము వికయేలరా-కౌస్తువా భరణ ధరా।కడకంటితో జూడరా॥ విఠలా॥ (1)

చ॥ మకర-కుండలభూషా మానిమానసోల్లాసా యికతాళ నర్వేశా హింసబెట్టకుశ్రీశా యీశ్వర దుఃఖనాశ॥ విఠలా॥ (2)

ఎటులోర్తును శ్రీధర యికవినద నామొఱ యిటువేగమెరారా హాటమిక సేయకురా హరియికనాతోపోరా॥ విఠలా॥ (3)

తామస మికయేల తాళజాల పుష్పాల రామదాసుని నేల-రమ్మి రాజసమేల రాధాకృష్ణ యీవేళ॥ విఠలా॥ (4)

ఆ-వె॥ వేగరమ్ముదేవ వేదాంత। వేద్యనీ భాగవతులలోని।
పాలివాడ నాగశయన వన్ను నగుబాటుసేయక।
రాగదయ్య పూల రామనామా॥

శా॥ సుంతైనన్ దయలేకపోయె-వితలా-సూనుండిగన్నాడనీ।
పంతంబేల।ఘరాత్మరా-ప్రబలుడై-బాధింపగా-జెప్పనే।
వింతాయెన్గద-నాకుజాడగనవో-విశ్వాధిపానన్నునీ।
పొంతన్ జేర్చుము-పుణ్యగణ్య-నికనో-పుష్పాలరామప్రభో॥

జా॥ యిందుముఖీ వానికి యను వర్ణమట్టుగా.

(జావళి) బ్యాగ్ రాగము - రూపక తాళము.

ప॥ సుందరా।ధా-మనోహరా- యిందురావేరా-నా-యందేమలు
కరా-భక్త-బృంద-మందారా-నీదు-యందము-జూపరా-ఓ॥ సుం॥ (1)

అ॥ వందనములు।జేసెదనో-వింద।వరమీరా-యెందుకు-యీ-చలము
శ్రీధరా-యదుకులవీరా-ఓ- మందరగిరిధరా- నాతో। మాట। లాడరా।
యీ।మర్మమేలరా-ఓ॥ సుం॥ (2)

చ॥ నీరజదళ।లోచన।ఓ।నిగమగోచరా। ఘోరభవా।వనకుఠారా।కోరి
యున్నారా।నాపై।కోపమేలరా।ఓ।మేరుసమధీరా। నీకు। మేరగాదురా।
ఓ॥ సుం॥ (3)

ఎంతవేడు।కున్న-నీమతి।సుంత।కరుగదా। పంతము సే।యకు- నే-
పశి-బాలుడగాడా- నను- పాలింప-రాదా- నా-తో- నిక-వాదా।నిను।
నమ్మి-యుండలేదా- ఓ॥ సుం॥ (4)

వారిధిశయనా। యికనాతో। వాదులాడకా। ధారుణి-పు।ష్పాల
రామ-దాసపోషకా-నీ-దయను-నురువకా-నీ-దరిజేరితినికా।యాదవకు
లనాయకా- ఓ॥ సుందర॥ (5)

కం॥ నాకష్టము-దీర్చెడిధార-నీకంటే-లేరు-లేదు-నిశ్చయముగనన్।
జోకను-పాలన-జేయుము-శ్రీకర-పుష్పాలరామ-శ్రితజన- ప్రేమా॥

శా॥ తానీపా।యొకనాడు।క్షౌరమునకై।తత్వజ్ఞ।ధర్మాత్ముడా।
సేనాహ్వానిని।పిల్వగా।నతడునీ।సేవన్।లిగన్।జేయుచున్।
రానేమఱచినయవ్వడే।యతని।వే।రక్షింపగా।విట్ఠలా।
బూనన్।క్షౌరము।జేసివచ్చితివిగా।పుష్పాలరామప్రభో॥

హిందుస్తాని కాపి (ఇంద్రసభవర్ణమట్టుగా) మిశ్రలఘువు.

ప॥ నారాయణా-నాతలవ్రాలు-నెవరికెరిగింతూ- నే- నెవరికెరిగింతూ॥

అ॥ పారావారగంభీర-నను పాలించు-మీప్రొద్దూ-శ్రీమ॥ న్నా॥(1)

చ॥ అఖిలభువనా-ధారుడని-నిన్నాశ్రయించితి నేనిన్నాశ్రయిం చితి-యికనన్ పరిశోధింపకుముయా యిలలో-శ్రీపతీ యికనన్-పరిశోధిం పకుముయా యిలలో-శ్రీపతీ॥ శ్రీమ॥ న్నా॥ (2)

దాసపోషకుడనినిన్ - దోసిలొగ్గితి- వినినన్-దోసిలొగ్గితి మోసబుచ్చ-మేరగాదు శ్రీశయాశ్రితీ-నన్- మోసబుచ్చ- మేరగాదు- శ్రీశ-యాశ్రితీ॥ శ్రీమ॥ న్నా॥ (3)

సామగానశ్రవణలోల- స్వామిభద్రాచల- నా-స్వామి భద్రాచల- రామదాసుని- రక్షింపను- రమ్మియావేళా- రామదాసుని- రక్షింపను- రమ్మి-యావేళా॥ శ్రీమ॥ న్నా॥ (4)

శా॥ నీపాదముల్గను-నాకు తెల్లమైనన్-నన్నేవేషముండంటిగా।
నేపాటిందగ-జూడవై తివిగదా- హేవిఠ్ఠలా-పాహిమాం।
నీపాదంబులయాన-యింక-నిను నే- నీడ్చిడ్చి-మెప్పింపగా।
భూపా-యేమని-చెప్పబోదు వాసుమీ-భద్రాచలరామప్రభో॥

కం॥ హరిశ్రీకృష్ణా-మాధవ-శరణాగతరక్షనిన్ను- శరణంటినినే।
దురితాత్ముడ-బ్రోవుము నను- మఱువక-భద్రాచలరామ-మానితనామా॥

రామకృష్ణగోవింద నారాయణా అనువర్ణమట్టుగా.

హిందుస్తానికాపిరాగము (ఇంద్రసభవర్ణమట్టుగా) త్రిశ్రలఘువు.

ప॥ నారాయణా-నన్ను వేగ-నాదరించరా।

అ॥ నేరము లెన్న బోకురా- నేనీవాడరా॥ శ్రీమ॥ నా॥ (1)

చ॥ మారజనక- మార్తికహర- మరచుటమేరా- భారమునన్ను బ్రోవను-భక్తమందారా॥ శ్రీమ॥ నా॥ (2)

కరిమొఱవిని- క్రన్ననసేగి- కరుణించలేదా। పరిపరివిధములను వేడిన పలుకగరాదా॥ శ్రీమ॥ నా॥ (3)

మున్ను భక్తులబ్రోచినట్టి-మూర్తివిగావా-కన్నులతో-జూడవే నను-కరుణను దేవా॥ శ్రీమ॥ నా॥ (4)

గోలకొండ- నిలయనిన్నే- కోరివచ్చితి- బాలగో-పాల-భక్త- పాల-నీక్షితి॥ శ్రీమ॥ నా॥ (5)

సామగానశ్రవణలోలా।స్వామిపుష్పాల।రామదాసునీయీవేళా-
రక్షించుశీలా॥ శ్రీమన్నారాయణా॥ (6)

శా॥ రారావిఠ్ఠల।మంచివేళ।యిదిగో।రక్షింపవే।వేగమే।
భారంబేల।భరించెదో।వినుము నే।బాలుండ।మూర్ఖుండనన్।
జేరంగావగుగాక।నిర్దయుడవై।చేవీడగా జెల్లునే।
భూరామామణినాథ।బ్రోవవెనను।పుష్పాలరామప్రభో॥

కం॥సుంతైననుదయరావా।యెంతని నే।వేడువాడ।నెయ్యాదోనర్తున్।
బంతంబేలను నాతో।వింతల।పుష్పాలరామ।విధినుత।నావా॥

ఇంద్రసభ సరస।స్వల్పాపకారి।కొందను।పొయ్యారకారి-అను యీవర్ణమట్టు.

రాగము హిందుస్తానికాపి (ఇంద్రసభ) అటతాళము.

ప॥ రారశ్రీపండరినాథా।రక్షకిక-నాతోవాదా॥
అ॥ నేరమెంచుటా-మర్యాదా-నేనీదాసుడనూకాదా॥ రా॥ (1)
చ॥ అఖిలభు-వనాధారా-అరవింద-పత్రనేత్రా॥
యికనన్।శోధింపమేరా।ఈశ్వరా నే-తాళలేరా॥ రా॥ (2)
దాసుల-భుడవని।దోసిలొగ్గివేడితినీ।
శ్రీశానామొఱనూ-వినీ-శీఘ్రమేరక్షిం-యవనీ॥ రా॥ (3)
కామజనకా-పుష్పాల।రామదాసపరిపాలా।
యేమిసేతునూ-యీవేళా।యెట్లోర్తూ।యికనే తాళా॥ రా॥(4)

శా॥ వాదావిఠ్ఠల। నామొఱ।ల్చెవులకున్।వైరంబుగాదో ప్రభో।
భేదంబెంచుట నీతిగాదు।వినుమా।శ్రీమత్ప్రతాపుండవై।
శ్రీదేవిన్గని।చెప్పకొందమనగా।జేరంగ రా-దాయెనున్।
బోదోకర్మములన్నియు।న్నినుగన।న్పుష్పాలరామప్రభో॥

శా॥ రారాయీసమయంబునన్ విఠలనీ।రాకన్ని రీక్షింపనే।
యేరా।యెంతనిబిల్తునీకు।చెవుడా।యేకాంతబోధించిరా।
చేరన్రాకటుమ్మాని తైవిభుమునీ।చేతుల్తగన్బట్టుకన్।
బోరాడన్నినునీడ్చి।తెచ్చదనువో।పుష్పాలరామప్రభో॥

(కీర్తన) రాగము బ్యాగ్-ఆదితాళము.

ప॥ రామ। నిన్ను సీతను। నేమముతో సేవించు ।

అ॥ నోముఫలించు టెన్నడో॥ శ్రీరామ॥ (1)

చ॥ పరమపావననీదు-తిరువడిగళునాదు ।
శిరమునసోకు టెన్నడో॥ శ్రీరామ॥ (2)

గరుడగమననన్ను-నరమరలేకికను ।
కరుణతో। నేలు టెన్నడో॥ శ్రీరామ॥ (3)

తిరుమంజనముజేసి। తిరుమణికాపువుంచి ।
మరచి। సేవించు। టెన్నడో॥ శ్రీరామ॥ (4)

పసిడిపుట్టముగట్టి। పలుసొమ్ములను బెట్టి ।
విసరుచుజూచు టెన్నడో॥ శ్రీరామ॥ (5)

మధురాహారములను-విధిపూర్వకముగాను।
వదలకర్పించు టెన్నడో॥ శ్రీరామ॥ (6)

కమ్మనిగంధముబూసి-తమ్మిమాలికవేసి ।
తమ్ములమిప్పించు। టెన్నడో॥ శ్రీరామ॥ (7)

హరిదాసులతో గూడి-హరతులెత్తుచుపాడి ।
యానందించుట। యెన్నడో॥ శ్రీరామ॥ (5)

ధరలో పుష్పాలరామ దాసునిపై నీప్రేమ ।
మరువక యుండు టెన్నడో॥ శ్రీరామ॥ (6)

కం॥ శ్రీరామాయని। సతతమ్ము నోరాడినజాలు। నూరు। నురుదోషంబుల్
బారును। ముదిదలచిన। ఘనులారా। పుష్పాలరామ। లాలితనామా॥

శా॥ శ్రీభద్రాచల। రామదాసులును నా। శిష్టుల్ జగన్మిత్రులున్ ।
హేభద్రాప్రియ। యన్న బాజిపఠనా। యెచ్చైన। మచ్చెంద్రనాద్ ।
నీపాదంబులె నిత్తలా గతియనే। నీనర్తి చేవాదులున్ ।
భూభారంబు। నివర్తిజేసుకొని రే। పుష్పాలరామప్రభో ॥







శ్రీ కృష్ణాయ నమః.

# శ్రీకృష్ణలీలలు.

కం॥ రారాయదుకులధీరా - రారాకంసవిదారా ।
రారాశౌరా - రారాకోరికలొసగను ।
రారాపుష్పాలరామ - రాఘవనామా ॥

(కీర్తన) రారాశుభాంగా। శీఘ్రమే చను గ్రోలంగా। అనువర్ణమట్టుగా.

(కీర్తన) దేశికతోడి -. ఏకతాళము.

ప॥ రాధాకృష్ణయ్యా। నను। రక్షింప వేమయ్యా ॥
అ॥ వాదేలనయ్యా - వదాలాని। వాడన। య్యా॥ రాధా॥ (1)
చ॥ యాదవ। కులబాలా - యద్భుతగుణశీలా ।
మాధవనను వేగా - మహిలో। రక్షింపవయ్యా॥ రాధా॥ (2)
మురళీగానవినోదా - మునిజననుతపాదా ।
ముత్యాలకించి వేగా - మోముజూప వేమయ్యా॥ రాధా॥ (3)

కోటిమన్మధాకారా।గోవర్ధనోద్ధారా।
హాటకాంబరనన్ను-ఆదరించవేమయ్యా॥ రాధా॥ (4

వాసిగ।చెన్నపుర।వాసలో కేశ।యీశా ।
దాసపోషకనన్నూ-దయజూడవేమయ్యా॥ రాధా॥ (5)

ధరలోపుష్పాలరామ।దాసునిపై నీప్రేమ।
నిరతముయుంచివేగా-నెనరున।బ్రోవుమయ్యా॥ రాధా॥ (6)

ఆ-వె। పత్ని-యధమురాలు-బాలురు-మూర్ఖులు।
కలుగు- చుట్టములిల-గర్వమరులు।
ఇట్టి-కాపురసుఖ-మెట్టులో పుష్పాల
రామదాసవినుత-రమ్యనామా ॥

(ఇంద్రసభ) శ్యామరాజ।భూపతీనమో।నమో-అనుయింద్రసభవర్ణమట్టు.

(ఇంద్రసభ).

ప॥ స్వామిశ్రీ-పాండురంగా-శాశ్వితపాహి।

అ॥ ఏమిసేతు-యిపుడు।వరము-యిమ్ము।యీమహీ-యో-దే-వా-రా-పరమునీదేహి॥నాస్వామిశ్రీ॥ (1)

చ॥ రాధారు-క్మిణీనాధా-రాజీవపాదా - వేదనలా-దీర్చరాదా-వేదాంతవేద్యా।వే-సా-రి-తి-వెడలిరా శ్రీపతీ॥ నాస్వామిశ్రీ॥ (2)

యోగిమనో-సంకాశా-యోజగధీశా సాగిమొక్కెద- సర్వేశా।సంకటనాశా-శ్రీ-రా-మే-శా-శీఘ్రిమెరాశ్రీశా॥నాస్వామిశ్రీ॥ (3)

సామజ-పాలా-కృపాలా-స్వామిపుష్పాలా - రామదాసుని - రక్షించను-రమ్ము-యీవేళా-రా-మా-ప్రా-భో-రాజసమేలా॥నాస్వా॥(4)

కం॥ పతినిం-గొల్చెడిసతులకు-అతిముదమా-నోముఫలము।
లబ్బునుపదపద్మ।గతిపతి-యందురు-పెద్దలు-
సతతము-పుష్పాలరామ-శాశ్వితనామా॥

(కీర్తన) రాగము, బ్యాగ్ ఆదితాళము.

ప॥ రావమ్మసాగి।రమణీమణీరో బేగి॥

అ॥ గోవిందు-నింటికేగి।కోపగింతము-రేగి॥ (1)

చ॥ ఇందుముఖి-రవమ్మా।యిపుడేయశోదమ్మా॥నందనుడుజేయురిమ్మా
నాతికెరి-గింత-మమ్మా॥రావమ్మసాగి॥ (2)

చ॥ బాలుడని మేము-మాలిమినుండమా-పాలిండ్లనుబట్టి-ప్రక్క కురమ్మనే॥ ఎం॥ (2)

కొమ్మరో! నేనుగా-యమ్మాయి పరుండ-కమ్మవిల్తుని కేళి - కలిసి యేగెనుపీ॥ డె॥ (3)

మగువరో నేనునా-మగడునిద్రింప పన్నగముపై బడవైచి అగడుజేసిపోయె॥ నం॥ (4)

ధరలో పుష్పాల రామ-దాసపాలకుడు-తరుణులందరి జెలచి-తరలిపోయెనుపీ॥ డెంతః॥ (5)

తే- గీ॥ భర్తయే దైవమని కొల్చు-భాగ్యశాలి।
యుండు దేశంబు సిరులచే నిండివెలుగు।
బతితపావనుడా వెకు బదవులిచ్చు।
రక్షకుడవీవు పుష్పాల రామనామా॥

కీ॥ సారస।సమముఖ।పరమపమా।అనువర్ణమట్టుగా.

(కీర్తన) రాగము-కమాసు-ఆది తాళము.

ప॥ ఈ నందకుమారుని-తొందర-వినవమ్మా-యశోదమ్మా॥ ఈ-నందకుమారుని-తొందరవినవమ్మా॥

అ॥ పీరందరుజూడమా! మందిరమునమీ-నందనుండు శే-యుచుంటు అల్లరి॥నందకు॥ (1)

చ॥ పటుతరము।గదివ్యాభరణములతో భిల్లక మెల్లక - అటుయిటు జూడక మామందిరమున-వెళ్లక।పటుకు పటుకుమని తాళముల్-దీసెను గుటుకు-ఘుటుకుమని-పాలుబోసేసెనూ॥ (2)

పడతి యొకతె పడ-కింటితలుపుమూ-సుకొనీ-పండుకొనీ- యొడలెరుగకని-ద్రింపగ తా-గనుగొనీ పడతికిప్రక్కను పరుండిపోకే ముడివిప్పిమరు కేళినిగలిసెను॥ నం॥ (3)

పిల్లవానియింటికి కావిలి యుం - చితిమీ వెళ్ళితిమీ గొల్లభామలతో యమునలో జలకమాడితిమీ।గుబ్బు జేరునం-తలో నీతనయుడు కొల్లలాడెనూ చల్లపెరుగులను॥ నం॥ (4)

ధరలోపల-పుష్పాల రామదా- సులనూ త్వరనూ పరమకృప
తో-నేలెడు పరమాత్ముని-యికనూ పొరుగు-యిరుగుయిం-
డ్లకుపోవద్దని బుద్ధి-చెప్ప వేఃముద్దియ మదిగోని॥న॥ (5)

తే- గీ॥ కడవపాలున గోమూత్రకణము పడిన। క్షీరమంతయు చెడునట్లు।
స్త్రీలనేక నేలునోములు నొకటంతు వేగ చెఱుచు। భువిని
పుష్పాలరామ శ్రీ- పుణ్యనామా॥

(కీర్తన) సురటి రాగము-చాపుతాళము.

ప॥ రాజాననా వినవే నీ।తనయుని।రచ్చలెల్లను గనవే

అ॥ యేజోలినావిడ్డ। చెరుగడనిబల్కెడు - రాజ। గోపాలుని-
రాయిడిమెుండాయే॥ రాజాననా॥ (1)

చ॥ కొడుకు-కోడలు-జంట-గూడినిద్రించ-నింట, నిడుదసర్పము
తుంట-బడవై చె-ని దేతంటా॥ రాజానన॥ (2)

పణతిమా-ప్రారబ్ధము-పరగ- జెప్ప శక్యము-త్రుణమాయ-
మానార్థము మీధూర్తయనర్థము॥ రాజా॥ (3)

ధరలో పుష్పాల రామ దాసహృ।ద్బిలయుని - పొరు-గిండ్ల-
పోవద్దనీ-పాలతి-బుద్ధి-జెప్పు-బూనీ॥ రాజానన।వినవే॥(4)

కం॥ పతి చే। హరియని।వలచెడి।సతులెవ్వరో।చూడభువి।జగడములాడ ॥।
సతులెన్ని।కోట్లోయుందురు।సతతము।పుష్పాలరామ।సన్నుతనామా॥

సురటి రాగము (కీర్తన.) రూపక తాళము.

ప॥ ఏలాగు తాళుదుమమ్మా-యశోదమ్మా-యేలాగు-తాళుదుమమ్మా॥

అ॥ వాలాయముగ రేపల్లె- వనితల। నందరినీ-బాలుడు - చెఱచినాడు,
పరమపురుషునికొడు॥ యేలాగు తాళుదుమమ్మా॥ (1)

చ॥ తెల్లవారగముందు-లేచి-మాపిల్లలు।గొల్లలు-చిలుక తాజూచి-గొల్ల
ల-పిల్లల - పిలచుకొనివచ్చి - ఇల్లుజొచ్చి-కొల్లలాడివెన్న-
పిల్లలకును-యిచ్చి వెళ్లిపాయనుదుసు-కెల్ల।చల్లగవిను॥ఏ॥(2)
కుండలో వెన్నసురిడగా।నీ।కొడుకూ।గండుతనము।మీరగా।
నా-మగడు।యింట।నుండని। సమయముగా।జూచియట్టె। కంచ

క్రొవ్వునవాకుండలో। వెన్న యు। పట్టినపాపకు। కుక్కి। పరుగిడి
నాకు నేడు॥ ఏ॥ (3)

చిన్నడు, యెరుగమమ్మా-యిటు వంటి। పిన్నవాని। భువిలోనమ్మా-
అక్కరతో। కన్న వారికిని। ఘనమూ। లేకున్నను। విన్న వారికిని। ప్రి
యమా। పన్నుగ। పుష్పాలరామ। భక్తపాలకుడమ్మ। యెన్ని నేర్చి
నాడో। వీసి। యెవరెరుగుదురమ్మా॥ ఏలాగు తాళుదుమమ్మా। య
శోదమ్మా యేలాగు తాళుదుమమ్మా॥ ఏ॥ (4)

కం॥ తనమగని-దలను మరియము। దనరంగను। నూరిజారు। గలిశెడివనితల్,
ఘను లెటుల-మెచ్చుదురువగ। మనమున। పుష్పాలరామ-మాధవనామా॥

(కీర్తన) రాగము-సురటి-రూపకము.

ప॥ తల్లివినుయశోదా-నీ-తనయు-డుడు కెల్లనుమా॥ తల్లివిన వేయశోదా॥

అ॥ కల్లగాదు రేపల్లెకాంతల। నడిగిచూడు॥ త॥ (1)

చ॥ నిన్న సంజె వేళ కాడ-చిన్న బిజలకంబులాడ
తిన్నగా తానాజాడ। తెలసివచ్చెనుజూడ॥ త॥ (2)

వారిజలోచనులు లేవి. వారికిబోవంగ జూచి
వారిజాక్షుడు వెంబడించి। వారియంబరములుదాచె॥ త॥ (3)

ధరలోపుష్పాలరామ। దాసుని సాక్షిగవినుమ
పరమపురుషుబనులికమా। పట్టజరగనీకుమమ్మా॥ త॥ (4)

కం॥ తలపోవు, జారవనితల। గలసినమతి, మానధనము, ఘుడియకు। దగ్గుణ
కులహీనుడౌట। దప్పదు, యిలలో, బుష్పాలరామ। యీప్సితనామా॥

(కీర్తన) సురటి రాగము-అటతాళము-చాపు.

ప॥ వినవేయశోదమ్మా వీని నడతలు వినవే యశోదమ్మా॥

అ॥ వినవే కృష్ణుడుబహు, వింతలవాడూ, కనుగొను। నను నేడూ
కౌగలించుకొన్నాడూ॥ వినవే॥ (1)

చ॥ నిన్న రేత్రికి, వేళపచ్చి, కన్న-గానివల్లె, తిన్నగ, మా, యిల్లు
జొచ్చి, పూరిలోగల, పిన్న వాండ్రను వెంటదెచ్చి, వారికెల్ల,

(కీర్తన) జంజూటిరాగము-ఆది.

ప॥ ఏమమ్మా-యశోదమ్మా-స్వామియెనుగిజె-ప్పదవినుమా॥ ఏ॥

అ॥ రట్టుజేసీమమ్మ-పట్టిద్రోసీ౹మా-పుట్టిపాల్లెల్ల-కొల్ల - బెట్టేటిసీ॥ (1)

చ॥ పారివచ్చిమా౹ పడకజొచ్చి - ప్రేమ-మీరమమ్ము - గూడె-మరులు-

హెచ్చి॥ (2)

తరుణులందరు - దధి - తేఱువగనూ-వచ్చి-స్తనద్వయముల

బట్టె - ననువుగ్గనూ॥ ఏ॥ (3)

ధరణి-పుష్పాలరామ-దాసపోషుని-నేల-ఏందింపకినున్నావమ్మా-

దధిచోరునీ॥ఏ॥ (4)

ఆ-వె౹ పతివ్రతనోటితో పక్కమనితిట్టినా౹

ఫాలనేత్రుడైన - బాధపడును ।

క్షితినియట్టిస్త్రీల - జూడము ।

పుష్పాల-రామ సుజన-వినుత-రమ్యనామా ॥

(కీర్తన) రాగము-జంజూటి-ఆది.

ప॥ వినవేయ-శోదా-వివరింతునా-సాదా॥ వి॥

అ॥ తనయుని-సాటీయిక-ధరలేదన్నావు-గనుక ॥ విన॥ (1)

చ॥ నిన్నరేపగడవచ్చి-తిన్నగమా యిల్లుజొచ్చి

కన్నబాలుర-బిలచీ-వెన్నపంచి-పెట్టె-ఎలచీ॥ విన॥ (2)

చిందెడు-పాలుగాచి-మందసములొ-నుంచజూచి

కిందుడద్రిత్రాగిలేచి-యెందుబోయెనో-తలచీ॥ విన॥ (3)

ధరలోపు-ష్పాలరామ-దాస-వినుతునమ్మా

పరులగుమా-యిండ్లకుమీ-బాలునంప-బో-కుమా॥వినవే॥(4)

కం॥ ఎందుకు-పంతమునాపై-సుందరముఖ౹కమలమిపుడు-జూపుము -

కరుణా ౹ వందనములు-సేసెదసుర-వందిత ౹ పుష్పాలరామ -

వైభవనామా ॥

కీ॥ మందగమనలారా-రారే-బృందావనమునకూ అను యీవర్ణమట్టు.

ముఖారిరాగము-(కీర్తన)-ఆది.

ప॥ యెంతటి-వాడవుర్రా-నీవిప్పు-డేమంటివి-అవురా-యింతదుడుకుమాట

లు-బల్కెదునీ-కిది-ధర్మ-మటరా॥ యెంతటివాడౌరా॥ (1)

అ॥ వొంటరినై-యరిగి-పురుషులు-యింటలేని దెరిగి-కొంటెతనంబులు
చేసెదవేరా-కోమలులను మరిగి॥ యెంతటి-వాడవురా॥ (2)

చ॥ తొలగిన-దాననురా-నన్ను-తొందర పెట్టకురా-పలుమారునునిను-
బ్రతిమాలెదనూ-పారియికనుపోరా॥ యెం॥ (3)

తొలగుటది-యేమే-చెపుమా - తోయజాక్షీదినమే - నళినాక్షీనీపు-
బొంకులు-బొంకెదు-నాతీగూడుదమే॥ యెం॥ (4)

పురుషోత్తమ-వినుమా-యిదీ-పురుషులడుగ-ఘనమా-కరుణాకర -
మగడొచ్చును-మ్రొక్కెద-కంజలోచన-ప్రామ్మా॥ యెం॥ (5)

వచ్చిన-భయమేమే-నీకి-పిచ్చితనమదేమే-ముచ్చుతనములను-విడిచి
యునాతో-ముచ్చటాడవేమే॥ యెం॥ (6)

యెన్నినేర్చినావూ-నీవూ-చిన్నవాడుకావూ-కొన్నమగనివలె-కొ
నసాగింపను-కోరివచ్చినావూ॥ యెం॥ (7)

ధరలో-పుష్పాల-రామ - దాసులపరిపాలా - పరవనితలచెయ్-పట్ట
దలంచుట-పాడియె-గోపాలా॥ యెంతటి-వాడవురా॥ (8)

ఆ-వె॥ పాలునీరువలెను బరగగూ-డుంచెను ।
యాలు-మొగలు భాగ్య-శాలులిలను ।
గాపురంబునదియె - ఘనమగు-బుష్పాల ।
రామరఘుకులాబ్ధి రమ్యసోమా ॥

మాంజిరాగము(కీర్తన)అటతాళచాపు.

ప॥ ముద్దుకృష్ణా-విన్నా-వటరా-బుద్ధిగల్గి-యుండవేరా
అ॥ ముద్దియలం-దరు-గూడినీ-సుద్దులుదె-ల్పెదరే-పూనీ॥ ముద్దు॥ (1)
చ॥ అమ్మరో-వినవే-నేను-ఆడెదువా-క్యములను-కొమ్మలు-
దూరుబెల్లను-నమ్మదగదునీ-యుల్లమునను॥ అమ్మరో॥ (2)
నిన్నసంధ్య-వేళకాడ-చిన్నది-జలక-మాడ-తిన్నగాను ॥
నీవాజాడా-తెలసిదుముకగ-నేల-గోడ॥ముద్దు॥ (3)
మందలయలున-బాలురను-నేనూ-అందరుగూడి - యాడుచుండగమా-
కందుకమెగి-రందుపదేనూ-కనుగొనబో-యిలినిగానేనూ॥అమ్మరో॥

గొల్లవనిత-యొకతె-దారిని-చల్లలమ్ము-చుండుతరిని-పిల్లలు-
నీవు-గూడుకొని-అల్లరి-జేసితివట దాని॥ ముద్దు॥ (౬)

తెలుపుము-పు-ష్పాల-రామ-దాసుసాక్షిగ-జెప్పెద-వినుమా-తులువ
పడచుల-దూరుల-నమ్మా-వలదదెప్పుడు-వచియించి-తమ్మా॥అమ్మరో॥

కం॥ ఎప్పుడు-నినుభజి-యింతును నెప్పుని-భక్తజనుల-నీక్షింతునునే।
నెప్పుడు-నినుజెందుదునా-యప్పా-పుష్పాలరామ-యద్భుతనామ॥

(కీర్తన) ధన్యాసిరాగము-యేకతాళము.

ఎక్కడబోతివిరా-కృష్ణా-యిక్కడ రావేరా

అ॥ టక్కు-లుమా-ట్లాడకిక-నిక్కము బక్కురా॥ ఎ॥ (1)

చ॥ అమ్మనే-నెందుబోలేదే-అందరినడగవే నే
యిమ్మందిరము-లోనుండ-నిట్టుదూరు-కేసేవే॥ ఎ॥ (2)

అందగాడవనుచుని-న్నందరుముద్దు-లాడగా-యీ
సుందరుల-మోవియాని-చొక్కియుంటివే-మోగా॥ ఎ॥ (3)

అమ్మమ్మ-నూ-టవిసునే-నాట్లాడుచుం-ధగానూ
రమ్మని-కొమ్మలిచ్చిరి-రానని నే ననగనూ॥ ఎ॥ (4)

యేమిరా కృష్ణా-నీ-వెంత-జెప్పిన-వినవూ-పు-ష్పాల
రామ-దాసులపా-లింతునిని--షారేవూ॥ ఎ॥ (5)

కం॥ ధర్మసత్తులగోష్ఠి-ధర్మాత్మ-లకు లేక-పరమమూర్ఖులకును।
బ్రాహ్మమాట-సరసిజోద్భవునకు-సమ్మతి।
పుష్పాల-రామదాసవినుత-రమ్యనామా॥

కం॥ మగనిని-దగవలచెడియొక-మగువ-వలనె-నిన్నుభక్తి
మాటకొనర్తు। జగమున-నొరులను-వేడం దగునే।
పుష్పాలరామ-తారకనామా॥

(కీర్తన) రాగము-కమాజు-ఆది.

ప॥ ఏలరాకరు-ణాల-వాల-కృష్ణా-యింతా-దుడుకుని-కేలరా

అ॥ బాల-కనకసు-చేల-భక్తపరి-పాల-ఇంటను-య్యాల-నాడవ॥ ఏల॥

చ॥ జార-చోరు-డని-నిన్ను-దూరను పే-రె త్తినావ-దేమీ-స్వామీ
నారద-వందిత-చర-ణార-వింద-ధీరయిటు-రమ్మీ॥ మార-జనకసుకు-మార
శరీరనిన్ను-కోరినిత్య-సూరులెల్ల-చేరి-కొలుచు-చుండగ॥ నేల॥ (2)

చల్ల-పెరు-గెల్లనీవు-కొల్లలాడి-నావటయ-దేరా-ధీరా-యీ-గొల్ల
వాడలోగల స్త్రీ-లెల్లబలి కెదరిటు-రారా॥ యెల్లలోకము-లేలేటి-వల్లభు
డనుచుదాసు-లెల్లబొగడగయింత-పిల్లతనము-వలవ-దేలరా॥ (3)

మేలుగాదుర-వినుపు-ష్పాల-రామదాస - పరిపాలా-బాలా-నీ
లదేహా-వరవన-మాల-భూషణ-సుగుణ-జాలా- బాల-గోపాల-గొల్ల-
పాళెము-లోన-గోప-స్త్రీల-జోలి-వలదని-చాల-దెల్పిన-వినవ॥ దేలరా-
కరు-ణాలవాల-కృష్ణా॥ (4)

ఆ-వె॥ అంకుటాంధ్రకెల్ల రమణుండు-సుగుణుండు।
గుట్టువనితలకును - క్రూరజనుడు।
పండితులకు-లేమియ - ఖండదా-రిద్ర్యంబు।
రామసుగుణసీమ రమ్యనామా॥

(కీర్తన) కల్యాణిరాగము-చాపు

ప॥ ఎందుబో-తివిరా-కృష్ణా-యీవేళనీ- వెందు-బో-తివిరా-కృష్ణా॥
అ॥ కుంద-కుట్మల-రదన-యిందు-సమవదన - సుందరాంగనీవు - సం
దడి-సేయక॥ ఎం॥ (1)

చ॥ గొల్లలిండ్లల-కేగి - అందందుగల- చల్లపెరుగు-త్రాగి॥ పిల్లల
గూడుక-యల్లరి-జేసుక-కల్లరి-పగిదిగ-కలకా-లమునీ॥ వెందు॥ (2)

చిన్నతనము-మీరీ-ఊరినున్న-పిన్న-పా-పలతో-చేరీ-కన్నియల-జేరి-
కలయుద-మనికోరి-అన్న పా-నము లేక-అనుదిన-మునుపారి॥ ఎందు॥ (3)

శ్యామసుందర - బాల-పుష్పాల-రామదా-సాను-కూల॥ కామజనక
వరం-ధామ-స్సుగుణ-శీల-సామజ-వరదగో-పాలయీ-వేళ॥ ఎందుబోతి॥

కం॥ ప్రణమును-మాన్పగ-దక్షులు-మనసున-పుం-డై-య్యోనేని।
మాన్పంగలరే-ఘనుడు-హరి-దీర్చ్చ-క్రన్నన-యనఘా।
పుష్పాలరామ-యద్భుతనామా॥

(కీర్తన) రాగము యెదుకులకాంభోది అట.

ప॥ ముద్దుకృష్ణ-యింట-లేక-వొంటరిగాయా-ప్రొద్దెందు-బోతివిరా-గోపాలా-యీ-ప్రొద్దెందు-బోతివిరా।అమ్మా॥

అ॥ ప్రొద్దుపొడవగానే-ముద్దురంగడు-తన-యొద్దకు-రమ్మనెనే నాతల్లి-తన-యొద్దకు-రమ్మనెనే॥ ము॥ (1)

చ॥ ఇరుగు-పొరుగుబా-లురు-బిలచితేనా-కెరిగించి-పోతగదో-గోపాలా-నా-కెరిగించి-పోతగదో-అమ్మా-తరికుంభ-ముకాడ - పెరుగు-తరుచు-చుండ॥ మఱచినే-వెళ్లితినే-తల్లీ-నాయమ్మా-మరచి-వెళ్లితినే॥ (2)

వెన్న-ముచ్చవని-కన్నియ యొక్క తె-విన్న-వించిన-దేమిరా-గోపాలా-విన్న-వించిన-దేమిరా-అమ్మా-అన్న నేనునిన్న-మొన్న-మనయింటిలో-వెన్న-దిన్న-దెఱుగవా-నాతల్లీ-వెన్న దిన్న-దెరుగవా॥ ము॥ (3)

తరుణి యొకతే-పెరుగు-తరుచుచు-నుండగ-పురికిపై-నెక్కి తేరా-గోపాలా-పురికిపై-నెక్కితేరా॥అమ్మా-వరపంచ-కల్యాణి-తురగమనుచునే-పురికిపై-నెక్కితినే-నాతల్లీ-పురికిపై-నెక్కితినే॥ ము॥ (4)

అన్నిటి-కన్ని-సరిజబా-బొసగేవు-అవురాగో-పాలకృష్ణా-నాయన్నా-అవురాగో-పాలకృష్ణా॥అమ్మా-వున్నది-వున్నట్లు-జెప్పకున్న-నన్ను-చిన్న-పరతువే-తల్లీ-నాయమ్మా-చిన్న-పరతువే-తల్లీ॥ము॥ (5)

సూలాలొకతె-బ్రతి-మాలుచునుండగ-వ్రాలబోయినావటరా-గోపాలా-వ్రాలబోయినా-వటరా-యీ-బాలురెల్లరునన్ను-బట్టుటకునురాగా-కాలుజారి-పడితినే-నాతల్లీ-కాలుజారి-పడితినే॥ (6)

ధరలో-పు-ష్పాలరామ-దాస-మానసవాస-తడవాయ-పారిరారా గోపాలా-తడవాయ-పారిరారా-అమ్మా॥ విరివిగ-గోపిక-లాడుమాటలిక-వినసంటే-వత్తునమ్మా-నాతల్లీ-వినసంటే-వత్తునమ్మా॥ము॥ (7)

కం॥ పరసతితోపొందు - ప్రాణహానియొనర్చు।
పరమపదునివేడ - భక్తివొచ్చు।
ధరధనాద్యుండైతే - తప్పక మదమెచ్చు।
స్థిరముపు-ష్పాలరామ - సీతారామా॥

(కీర్తన) రాగము-బిలహరి-రూపకతాళము.

ప॥ఇంత్తాదుడు-కేలరా-కృష్ణా-యేవేళనునీ-కింత్తా-దుడు-కేలరా-కృష్ణా
అ॥ సంతతమునీ-రిండ్లకేగి-రంతులు-వింతలు-జేసిటు-గంతులాడి-
నావటనీ॥కింత్తా॥ (1)

చ॥తలి-తండ్రుల-మాట-వినని-పలుగాకివి-నీవనీ-యిలలోగొల్ల-చెలియ
లెల్ల-పలుమరు-బలుకుచునుండగ-తులువతనము-వలువదునీ॥ కిం॥ (2)

పాలుపెరుగు- నునయింట- చాలకలిగికయుండ-తుంట-బాలురతో-
గూడుకుంట-సారెదు-దూరెద-విండ్లను-జీరెదు-జవ-రాండ్రనుమరి॥ఇం॥

ధరలో-పు-ష్పాలరామ-దాసులకె-ప్పట్లప్రేమ-హరిహయనుత-దివ్య-
నామ-పరిపరి-వెఱగుల-గతితలు-మొఱలు-బెట్టెదరు-సరిమరి॥ఇంత॥(4)

కం॥ పరమ సాధుమతికి-పణతి-గయ్యాళివచ్చు ।
వరపతివ్రతకు-వసుధ-వచ్చుశుంఠ।పరబ్రహ్మవేదుక ।
భక్తులు-గనరెవు-ష్పాలరామనామ-పుణ్యనామా ॥

(కీర్తన) రాగము-జంఝూటి-ఆది.

ప॥ ఏదియెరుగనుతల్లి-యేదియెరుగా-నా-
అ॥ నీవదయ-యుంచివిను-మాటచక్కగా॥ఏ॥ (1)
చ॥ కొమ్మలెల్ల-కోర్కె-దీర్చ-కృష్ణాయనిరి-నే-
సమ్మతించలేనందుకు-చాడిజెప్పిరి॥ ఏ॥ (2)
పట్టుపట్టిరి-చాల-రొష్టు-జేసిరి-నే-
నట్టెపారి-పోగానేతా-మట్టె-దూరిరి॥ ఏ॥ (3)
ధారుణి పు-ష్పాలరామ-దాసుడెరుగూ-యీ-
తరుణులం-దఱునన్ను -జేయు-దుడుకూ॥ ఏ॥ (4)

కం॥ ఓరుపునకంటె-దొడ్డది-వేరొక్కటి-లేదుచూడ ।
వేదవిదితమీ-యోపుగ-లట్టివారలు ।
ధీరులు-పు-ష్పాలరామ-దీపితనామా ॥

(కీర్తన) రాగము-ధనాసరి-రూపకము.

ప॥ వినవేతల్లి-దెలిపెద-పూనీ-మనమలర॥ వి॥
అ॥ అనవరతము-గోప-వనిత-లాడిన-పెను-బొంకులెల్ల॥వి-త॥ (1)

చ॥ రేపగడ-లేచినేనూ-అన్నతోటి-తోపుజేర-బోవజాడనూ-గోపియొకతె-వచ్చెనెదురనూ- చూచి-దానీ-కోపగించిపోవ-నదియునూ-పాపరాధు-డనుచునీ| దాపుజేరి॥ యేపుమీర-కోపగించి-కొండెములను-చూపిపోయె-గదవెనన్ను॥వి॥ (2)

పిన్నపాపలెల్లగూడుకా- పొన్నతరువుక్రింద- చెన్నుమీరనాడుచుండగా-తిన్నగనే నందుబోవగా-కన్నియయొకతే-నన్నురమ్మనుచు బిలువగా-కన్నియరా- నేరనంటే-కానికాని-యనుచునీతో-వెన్నపెరుగు-పాలుచాల-తిన్నడనుచు-విన్నవించె॥వి॥ (3)

కరితలెల్ల-కడవలెత్తుకా- యమునకడకు - నరిగిరియతిరయము చెలగగా॥ పరిపరివిధములనుబాడగా - ధ్వనివిని నే-బిరబిరనుచు చేరి చూడగా॥ కరయుగములు బట్టినన్ను |కాంతలుజే-సినదెల్లను| ధరలోపుష్పాలమరా-దాసులకే-తెలియుగనుక॥ విన॥ (4)

కం॥ పతికిని-పట్టనామమి డే-సతి నేనని-పలుకుదాని-సరసిజనేత్రుం| డతులవధ- సేయనోపడె-సతతము పుష్పా-లరామ-సన్నుతనామా

(కీర్తన) రాగము-కాంబోది-ఆది.

ప॥ ఒక్క-చోటనుండ వేమిరా-వారీకుమారా॥ ఒక్క॥

అ॥ ఒక్క-చోటనుండవునీ| వెక్క-డను-తిరిగేవు॥తక్కి-రి-బిక్కి-రి-వేషధారులవలే-నీవు॥ ఒ॥ (1)

చ॥ అన్నతో గూడి యింటను-ఆడుకొనుమునీ-వంటే -వెన్నదొంగ-లించ-దలచి- వెడలితి-వేరా- కిన్నవారం-దరునిన్ను -కన్నగాడనుచు మది-నెన్నగజే సితివేరా-చిన్నిముద్దుల-కుమార॥ఒ॥ (2)

చాదుచుక్క-బెట్టి-పైన-చలువకా-లువగట్టి-బూచిబూచు-కోవద్దనీ-బుద్ధిజెప్పితే॥వీదులందు-బారి-గొల్ల-బీదపాప-లతోజేరి॥వాదులు-దెచ్చితివేల-వరద-శ్రీ-గోపాలా॥ఒ॥ (3)

ధారుణిపు-ష్పాలరామ-దాసులునీ-దివ్యనామ-చరితలు-బాడుచునుండ-చాలవినక॥ పురిత్రయము-లను-ప-విత్రునివలేయుంట॥ బాగానె యాయింట-బాలా|వద్దురతంట॥ ఒక్క॥ (4)

కం॥ తనసతిని-విడచి వేత్రోక।వనితను-గవనించువాని। వదలదు కాలుం
డనుపమ-బాధల బెట్టడె।గనరిలపు-ప్పాలరామ।కామితనామా॥

శ్రీకృష్ణపరమాత్మని వాక్యములు.

రాగము-నాధనామక్రియ-(కీర్తన)-ఆది.

ప॥ ఏమి నే - నెరుగనమ్మా -నీవు-

అ॥ నామీద-నేర-మెన్నగ-న్యాయమా। యెన్నగ-న్యాయమా॥ఏ॥(1)

చ॥ ఇంటికి-నన్ను-రమ్మనేనూ-పోవకన్నే-నుంటి నేనిందు-నిమ్మతిగనూ
ఇందు-నిమ్మతిగనూ-దాని-కొంటెతన-మేమనందునూ-నేను - కంటి సైగ
జేశితని-కల్పించె-వినూ-యిదికల్పించె-వినూ॥ఏ॥ (3)

తెల్లవారి-నన్ను జూచిరీ-యో హెూమనూ- యల్లుడా-యింటికి వేగ
నరుదెమ్మనిరీ-వేగ - నరుదెమ్మనిరీ-నే। నొల్లని-భావం చెతిగిరీ-నీతో-చల్ల
పెరుగు-పాలు-కొల్లలాడితనిరీ-కొల్ల-లాడితనిరీ॥ ఏమి నే॥ (3)

మందకు-పోయి నే-రాగానూ-యీ-సుందరియు-నన్ను బాగా। జూచు
చుండెనూ-బాగా-జూచుచుండెనూ-పొందుకు-నన్ను రమ్మనెనూ-యెల్ల
నన్నా-యిందుముఖి-నీతో విన్న-వింతు-ననెనూ-విన్న-వింతు-ననెనూ॥

మాటకు-కరువుగలదా - యొక-బోటినైనా-సత్యము-నుడువ।
గలదా-నుడువ-గలదా-యిక-యేటికి-మాటలెల్లా।వృధా-నా- బోటివా
ని-పైన-యిట్లు-బొంకక-రుగదా-యిట్లు-బొంకక-రుగదా॥ఏమి నే॥ (5)

వన్నెలాడి-మాటవినకూ-దీని -కొన్నవాని-తలలోను-కొట్టునే
మేకూ-బాగా-కొట్టునే-మేకూ।యిది-యున్నదిశి-జూడు-శీకూ-నే।నన్న
ను-దీనికేమో-తగిలెచుటుకూ-తగిలె-చుటుకూ॥ఏమి నే॥ (6)

తరుణులబ-ద్ధములా దేరూ-యీ-ధరలో-పుష్పాలరామ-దాసులం
దరూ-రామ।దాసులందరూ।నన్నా-శరణని-గొలుచు।చుందురూ-వీరి
దురితపు-మాటలు-విన్నా-నేమనందురూ-నన్నేమనందురూ॥ఏమి॥ (7)

ఆ॥వె॥ ఆలుసరిగనుండు - టదియే సంసారంబు।
ఆకుటుంబమునకు - నగదు రాదు।
మాలసుగుణుడైతె - మాన్యుండుగా చెపు।
ప్పాల-రామనామ - భక్తకామా॥

ఆ-వె॥ పాలు-నీరువలెను-బరగ-గూడుండెను-యాలు-మగలు।
భాగ్యశాలు-లిలను-గాపురంబునన్నియె-ఘనమగు-పుష్పాల।
రామరఘుకులాబ్ధి-రమ్యసోమా॥

కీర్తన - రాగము - బ్యాగ్ - ఆదితాళము.

ప॥ ఏలనమ్మ-మీరు-బాలునిదూ-రేరు॥ ఏల॥

అ॥ లోలాక్షు-లారమా బాలుని - సైరుగలేమా - పాలువెన్న
వెరు గెన్ను-భక్షింపగలజేయిన్నా॥ ఏ॥ (1)

చ॥ సువతిని-దన్నెన-ముగవు-జూపకవం-డింపలేనూ-వదరేమి-యిం
ద్లకును-బాగుగమ-ర్యాదగాను॥ ఏ॥ (2)

యెన్నడుగాను-గింత్రతోవ-నరుగనిపా-పడు-వీడు॥ యెన్ని నే
ర్చితిరే నేడు-యెన్నాళ్లొప-న్నితిరిగోడు॥ ఏ॥ (3)

బాలురతో-నాడుమంటే- భయపడుచు-నుండు-వాడు॥ బాలి
కల మరుకేళి-కేళీల-బిలుచు-పేడు॥ ఏ॥ (4)

చక్కనివా-డనుకొని- యొక్క-రీతి-చూపపూవి॥ టక్కులమా-
ట్లాడుకొని-యిక్కడికొ-చ్చితిరి-గాని॥ ఏ॥ (5)

భక్తితో పు-ష్పాలరామ భక్తునిపై-నిండుప్రేమ - ముక్తిదాయ
కుడైనమా ముద్దుకృష్ణుడే-కనుమా॥ ఏ॥ (6)

ఆ-వె బైటి-పుంటినెపుడు-భాగుసేయగవచ్చు మనసు।
పుంటినెవరు-మాన్ప లేరు-సదయులగుట మేలు।
జనులిల-పుష్పాల-రామ-విబుధకామ-రమ్యనామా॥

శంకరాభరణము - కీర్తన - చాపుతాళము.

ప॥ యేమియెరుగని-బా-లూడే-నా- స్వామి-సద్గుణశీ-లూడే-యేమి

అ॥ భూమిలో సాటిలేని-పుణ్యుడైనట్టి-వాడే॥ యేమి॥ (1)

చ॥ యెందుకు - మీకింత - వాదూ యిపు - డేమియెరుగనిస్వామి
మీదూ-కుందరధనార -విందలోచను-మందహాసుడౌ-బంధ
మోచను॥ డేమి-యెరుగని-బాలూడే॥ (2)

నన్ను విడచి-యెందు-పోదూ-యిక. నాతీమీ-యిండ్లకు-రాదూ
తిన్నగావచ్చి-వెన్నదినెనని పిన్నవానిపై-పన్నితిరివీ॥ డేమి
యెరుగని బాలూడే॥ (3)

బాలప్రాయము-గల-శీలూ-పు-ష్పాల-రామదాసులనేలూ శీల
కనకదుకూల - భ్రుతవన-మాల - కరుణాల - వాలుడగుప్పీ॥
డేమియెరుగని బాలుడే॥ (4)

కం॥ ఎప్పుడు నినుసేవింపుదు నెప్పుడునీ-నామమహిమ।
నింపుగమదిలో-నొప్పగ దాసులగూడుక।
జెప్పుదు పు-ష్పాలరామ జితరణభీమా॥

కీర్తన-ధనాసరిరాగం-ఆది.

ప॥ ఎక్కడ-బోయెనో-కృష్ణుని-గ్రక్కున-జూడరే॥
అ॥ అక్కరోస్వా-మినికోరి-మిక్కిలిప్రేమతో-చక్కగ-పారి॥ ఎ॥ (1)
చ॥ సుందరమై-నట్టియర-విందలోచనుడు-మన-కందర్పజనకుడుభవ-బం
ధ-మోచనుడు॥ ఎ॥ (2)

నీలదేహు-డై నవన-మాలధరుడు ఫాలలోచనాదిసుర-భక్త
పాలుడు॥ ఎ॥ (3)

జాలముసేయకవో-లోలాక్షిపుడు-పు-ష్పాలరామ-దాసువేలు
బాలకృష్ణుడు॥ ఎక్క॥ (4)

ఆ-వె॥ నాగశయన నన్ను నడివీధి విడచిన।
నాగరులును నగరె న్యాయమగునే।
సాగుచున్న దనుచు సంభ్రవించితివేమొ।
బాగుగాదు పువుల-భవ్యనామా॥

శంకరాభరణము (కీర్తన) రూపకం.

ప॥ యెటువంటి-వాడమ్మా - వీడూ - విటకాడం-మ్మశ్రీ-వేణు - గో
పాలుడూ॥ యె॥

అ॥ కుటిలాల-కులతోడ-గూడి నీళ్లకు-జోవ-మటుమాయముగవచ్చి-
మానాము-జెఱచేను॥ యె॥ (1)

చ॥ కోటూల-గూడూకా - నేనూ-మంచి - యాటాలాడుచునుండగా
నూ-యీ-నాటాక-ధారూఢూ- నయముగ-నను-జేరీ - చా
టూకూ-రమ్మని-సైగలు-జేశేనా॥ రెు॥ (2)

అమ్మ-చెల్ల-వినవే-నేడూ- నే-నలసి - బరుండగ - వీడూ-కొమ్మగో-
రమ్మని-కోరి కె-కొనసాగా-కమ్మ - విల్తుని కేళి-కలసి - యేగె
నువీ॥ ఆటువంటి॥ (3)

బాలూండు-వీడు-కా- దమ్మా - సొగసు - భావజ -జనకుడే -కొమ్మా
చాల-ప్రియముతో-పు-ష్పాల-రాను-దాసుని-పాలించు-నని
జెప్పి-పారి-పోయెనమ్మా ॥ యెటువంటి ॥ (4)

ఆ-వె॥ అద్దుమీరినడుచు - ముద్దియలపుడగ ।
బుద్ధిసెప్పెనింద - పుణ్యమొంది ।
పురుషులకునునటుల - పుకమిని పుష్పాల ।
రామదాసుపేత - రాగయుక్తుడు ॥

నాయకి నాయక బావప్రశ్నులు.

రాగం-కాంబోధి-(కీర్తన) అదితాళము.

ప॥ మొగము జూపి తేచాలు-ముద్దుల-కృష్ణ-యే-వగలాడి-బోధించెరా॥
అ॥ తగవేల-నిప్పుడా-తరుణి నేగూడరా - తగదుర -ననుజేర-దధి-నవ
నితచోరా॥ మొగము॥ (1)

చ॥ నిన్న రేత్రియందు-నిదురజే-సి నాముద్దు - తిన్నగమది-నెంచరా ॥
వన్నె కాడానాతో-వలపుజెసి తేనా-చిన్నది-నినుచాలా- సిగ్గెడ
బాపుర-చిన్నతనమునసీ -వన్న-పలుకులన్నియు - మన్నుగలసి
పోయ-నిన్నన-నే-మా-యా॥ మొ॥ (2)

ఊరి- లోపలను - వున్నతరుణులెల్లను - కోరకదారికేరు-కోమ
లాంగనన్ను-చేరిసరసమాడ, చెల్లదు-గతిగూడ- వారిజలో
చన-వలదుర-నా-తోడ-చేరియున్నవిన్ను-చేయజూర -విడ
చినే-నారుమా-నములాయ-అల్లరి-మొండాయె॥ మొ॥ (3)

రమ్మా భద్రాచల-రామ-దాసులపాల-కొమ్మలు-నినుచాలా- నమ్మ
రుగుణశీల-యిన్ముహీలోపల-నమ్మిక-లీగల-తమ్మికంటివిచాలా-
తడవాయనీ-వేళ-లెమ్ము-యిరుగుపొరు-గమ్మలు మొగనికి-అమ్మ
జెప్పెదురు లే-పొమ్మనీ-దునికి॥ మో॥ (4)

క౦॥ తల్లియు తండ్రియునీవని యుల్లములో నమ్మినాడ యుల్లాసముతో।
చల్లని కృపజూడుము శ్రీ వల్లభ భద్రాచల రామ వందితనామా॥

సావేరి-రాగం-(కీర్తన)-ఆదితాళం

ప॥ మోసపోతి-నమ్మా-ముద్దు-కృష్ణుని-నమ్మి-ముద్దు-గులుకు-గుమ్మా॥ మో॥

అ॥ వాసన-లలదుక-వాకిటనుండుక-గాసిబడుచునొంటి-కాలను-నిలచుక॥

చ॥ మజిల-పత్నినని - మాట-ఇచ్చెనుపూనీ-తళలాక్షి-విను-తల-తట్టి-
చెప్పెను-గాని-కటువాయ- తను-రాక-కన్నులకు-నిదుర-లేక-
విరులపై-బడి-మదన-వింటి-దెబ్బలు-దాక॥ మో॥ (2)

అతివ-యౌవనతో వాని-ఆడాగించెనో వ్రాని-యతడేలననుమాని-
అన్యులగూడునురానీ-కతమేమి, యనియిరు-కరములు-బట్టు
కొని-బతిమాలుకొని-యతనిభావము-దెలిసెదనుగాని॥ మో॥

వచ్చె - టన్నదురాని - వనదగో-పాలుడూ-పచ్చ-విల్తుని బాధ-
పడజాలనిప్పుడూ - చెచ్చెరపు - భద్రాచలరామ-సేవకుని చే-
పట్టియేలెదు - పచ్చనిచే - లామువాడు - పారినచ్చితే -
ప్రాణముండు॥ మో॥ (4)

రాగం ధనాసరి (కీర్తన) రూపకము.

ప॥ ఓర్వజాల-మదియికనేనూ-వో-చెలియరో వినుమ॥ ఓ॥

అ॥ సార్వభౌము-డైనహరియు- సరగునవిట-రాకయూ పూర్వముపలె
నెన్నుదతియింట-ప్రొద్దుబుచ్చె-నేనియూ॥ ఓ॥ (1)

చ॥ నిన్న సంధ్య-కడనువచ్చి-నెలతరో-బిలచి-మంచి - పొన్నవిరులు
కొప్పు-నుంచె నే-కోరినది-చ్చె నే-చిన్ననాటి- చెలిమి-మరచె
నే-వోరమణిరో నే॥ వో॥ (2)

బావమఱదు-లత్తమామ-బంధువులతో-దూరుపడితి-భావజజన
కునీ-నమ్మితీ-బాసజే-సితీ-దేవదేవు-డనుచు-కొలచితీ-వినవే
సుమతీ॥ ఓ॥ (3)

తరుణికొప్పు-ష్పాలరామ-దాసహృదయకుముదసోమ-అటయుట
కుచు-వేగజనుమ-స్థిరము-కనుమ-కరుణతో నా-దపస్థ-దెలు
పుమ-యిదివినుమ॥ ఓ॥ (4)

మధ్యమావతిరాగం (కీర్తన) ఆది.

ప॥ ఇంతమోహమునా-కేలగలిగెనమ్మా-యింతిరో వినవే-కొమ్మా।
అ॥ సంతత-ముని-రాజ-గోపాల-సామిపై॥ ఇం॥ (5)
చ॥ అత్త-మరుదులతో-నన్నత-మాడినే-నతనితో-జేరితినే-చింతలు
దీర-నతనితో-జే-రితనే॥ (2)

చిత్తము-గంజిల్ల-చిత్తజ-జనకుడు-చిత్తజు-కేళిని-జేసిన-మొ
దలుగ॥ ఇం॥ (3)

నింకవెన్నెలుగాయ-గుండు-మల్లెలు-పూయ-మిండుగోవెల
రొదలేయు నుంకసీయుక కండలున్నద-కాక గోర్వదాయ-
పుండరీకనయ-నునిపై-భ్రమలాయ॥ ఇం॥ (4)

• ఈసమయమునప్రా-ణేశుడు రాకున్న-లేసిపోవు-గదవే-నాప్రా
ణము-లేసిపోను-గదవే - వాసిగపు-ష్పాలరామ-దాసుని
బ్రోచేటి - వాసుదేవునిసెప్పు-డాసతో-గూడుదు॥ ఇం॥ (6)

కీర్తన సురటి-మిశ్రజాతి-యేకతాళం.

ప॥ చెలియ-కృష్ణుని-చెంత-చేరజేరినా-చింతకు-గోడి-తేగదే॥
అ॥ కులుకు మితారికృష్ణుని బాసికండ్లకు-మరుపు రాకున్నదే-తేగదే॥ చె॥ (1)
చ॥ అతడు-నింట లేని నిమిషము నాకొక-అయనముగా-నున్నదే-పతి యొ
క్క-ముద్దు-మాటలువినని చెవులు-పాడుపడి-యున్నదే-హితవు
గవాని పా-దమ్ములు వొత్తని చేతు-నిలను వ్యర్థములుగదే-సతత
ము వానిసంగతి జేయని తనువు-సౌందర్యమేలగదే వినగదే॥ చె॥

నాదిత-కృష్ణునిచాళ్ల - ముద్దాడనినోరు - మురికిబిలంబుగదే॥
పతిత-పావనునధర(పానముజేయనిజిహ్వా-పశువునాలుక-పగిదే
ముదముమీర - కృష్ణునిపై-పరిమళము - మూర్కొననిముక్కు-
ముదిరిన-చెక్కగదే-వదలకనా-ప్రా-ణేశుని-నెట్లైనా- వారి
జాక్షి-తేకుంటే-వసుధజమడిశెద-గదే॥ చెలియ॥ (3)

విరులశ్యపైని-విభునితో-గూడెడు-విభవము-గూర్పవటే॥
చెరుకు-విలు-కాడు-బల్ విరిశర-ములునా- యురమునవేసెనటే
విరివిగ-పుష్పాల-రామదాసుని నేలు-విభుడిందు- రాడోయటే
విరిబోణిరొనా- ప్రియునిలోడితెచ్చి - విరహము - బాపవశే
నీవటే॥ చె॥

కీర్తన-భ్యాగ్ రాగం-ఆది.

ప॥ వగపేలనమ్మా-పరునిదె-చ్చెదలెమ్మా॥
అ॥ ఖగ-గమనుని-కడ - కునుజని-పదములు-బిగబట్టుక - పిలుచుకవ-
చ్చెదమరి॥ వగపేల॥ (1)

చ॥ ఏలనీకు-దుఃఖము-యికతెగ-దుడుగుము॥
బాలగోపాలుని-పాలికిజనికెం-గేలుబట్టుకొనిగొబ్బునవచ్చెద॥వ॥(2)
చింతపడుటేల-యింతిరో-నీవుచాల।
కంతుజనకునీ సంతసపరచినే-నింతలోనరా-గలనంతలోనా॥వ॥ (3)
స్థిరమునా-మాట-నెఱనమ్మవే-యీపూట।
ధరలోపుష్పాలరామ - దాసులెనుగను - కరివరదునినీ-కండ్ల- జూ
పెదను॥ వ॥ (4)

ఆ-వె॥ ఆలినడతలెప్ప । డండమైననుబతి । ప్రాణధనములాపె । పాలు
సేయ । వలయుప్రేమ-నిలను । పరగుణ-పుష్పాల। రామసుజన
కామ । రమ్యనామా॥

మధ్యమావతి (కీర్తన) యేకతాళం.

ప॥ రారా-మా-యింటికి-నందకుమారా-నవనీతచోరా॥రా॥
అ॥ సారసనేత్ర-శ్యామల-గాత్ర-ఘోరపాప - పరి-హార - పవిత్రా-
రారా-మా॥ (1)

చ॥ నందా - నందన -శ్రీగోవిందా-నన్నేలు-ముకుందా-సుందరవదన-అరవిందనయన-సురవందిత-చరణ-శ్రీ-సుందరాంగ-యిటు॥ రారా॥ (2)

స్వామీ-నే జేసిన-నేరములేమీ-సరగునయిటురమ్మీ- పామరుడను నా-భవములకమ్మీ॥ కామితార్థములు-ప్రేమతో-నిమ్మీ-రారా॥

కామ-జనక-పుష్పాల-రామ-దాసవినుతినామ సోమవదన-రిపు భీమ-శ్రీ-రుక్మిణీ-మనోహరం-నామసుధామ॥ రారా॥ (4)

కం॥ నరహరి వేషము ధాల్చిరాగసురవైరిని-ద్రుంచి సుతకు సుస్థిర-వరముల్ కరుణాకర యొసగితివే మరువకుపు ష్పాలరామ-మాసితనామా॥

గౌరుకులకాంభోది (కీర్తన) చాపు-తాళం.

ప॥ నరసింహ్మా-నరసింహ్మా-నరసింహ్మా-నరసింహ్మా-నరసింహ్మా- నను బ్రోవు ఓంనారసింహ్మ॥

అ॥ ఉక్కు-కంబమునందు-ఉద్భవించి-బాలుని-గ్రక్కున-గాచిన-ఘననారసింహ్మా-ఓం-నర॥ (1)

చ॥ ఉగ్రదైత్యునిబట్టి-ప్రయ్యాలు-జేసియ-త్యాగ్ర-నఖముల్ ప్రోలి-నట్టిన నరసింహ్మ-ఓం-నర॥ (2)

భక్తవత్సలనీకే-మ్రొక్కి-వేడితి వేగ-ముక్తి యొసగు-వీర-లక్ష్మీ-నరసింహ్మా-ఓం-నర॥ (3)

తిరుగళోరంగి-పురమున-నెలకొన్న-వారిజాక్షునేని- వాడ-నరసింహ్మా-ఓం-నర॥ (4)

ధరను-పుష్పాలరామ - దాసుని-కరుణించ-తరుణము-యిదె-శ్రీ-హరినార-సింహ్మా-ఓం-నరసింహ్మా-నరసింహ్మా॥ (5)

కం॥ నామొఱ వినదా శ్రీహరి యేమోహో-యనక నన్ను ప్రేమతో యిక యీ-పామరుని నేలకున్నవ -దేమో పుష్పాలరామ దీపితనామా

రాగం కమాసు (కీర్తన) ఆదితాళం.

ప॥ నారాయణా-హరీ-నారసింహ్మ-ము రారీ॥ నారాయణా॥

అ॥ ఘోర-రాక్షసవి-దారీ-కోరితినీ-దారి-శౌరీ॥ నారాయణాహరీ॥ (1)

చ॥ అణువునందు-నణువువై-యమరియున్నాననుచు-పెనుమిణు-కులయందు-బెద్దలందురు-విందు॥ నారాయణాహరీ॥ (2)
ఉక్కు-స్తంభముననుదయించి-చెచ్చెరనూ-అక్కసుని-జీల్చి యిలనూ-గాచితి-వతని-సుతునూ॥ నారాయణా॥ హరీ॥ (3)
శ్యామసుం-దర-పుష్పాల-రామదా-సానుకూల-త్రామసింపుటపి మేల-సామగాన-లోల-శీలా॥నారాయణా॥హరీ ॥ (4)

కం॥ హరిహరి-నినునమ్మిననా దురితంబుల బాపుశౌరి దుర్జనవైరీ తపు ణంబిది నన్ను బ్రోవుము వరదా పుష్పాలరామ వాంఛితనామా ॥

రాగం కమాసు (కీర్తన) యేకతాళము.

ప॥ చింత-దీర్చ-వేల-శ్రీహరి-శ్రీ-నృకే-సరి-చింతదీర్చ-వేల-శ్రీహరి ॥

అ॥ సంతరించే-ఘోరవని-చెంత-జేరి-తిని-నాతో-పంతము-జేయుకు-భగ వంత-యంతని-వేడుదు॥ చింత॥ (1)

చ॥ ఎక్కడ-జూచినహరి-యేర్పడియున్నాడనుచు-యొక్క-రీతిగా జెప్పనీ-వెక్కడ-వ్యాపించుండయా-యుక్కు-స్తంభమునజూపు-మని-అక్కసుడుబల్క-గ్రక్కున-వచ్చి అక్కసు-పొక్క-జీల్చిన ట్టి-ఘోర॥ చింత ॥ (2)
మున్ను గజ-రాజుచాల-ఖిన్న మొందిని-నిన్ను వేడ-మన్ననతో వచ్చినీవు-క్రన్నన-గావగ లేద-పన్నగ-శయన-సుప్ర-సన్న-ప్రప న్నపోషణా-కన్నడ-సేయకనీవు-కన్నసుతు-నితోనా వ ॥చింతదీ ర్చ వేలశ్రీహరి ॥ (3)
జాలమికయేలను-పు-ష్పాలరామదాస-పరి-పాల-బాలునిపాలిం చవేల-శ్రీలోల-జాలిజెందినాడనిల-బాల-కరుణాల-వాల-పాలు మారకనుచాల-పాలించవలె-నీవేళ-చింతతీర్చ-వేల-శ్రీహరీ॥(4)

కం॥ హరినన్ను ఆదరించుము శరణాగత రక్షణార్థ శాశ్వతానందా। దురితుడ-నుస్మార చిత్తుడమరువకు పుష్పాలరామ-మానితనామా

రాగం బిలహరి (కీర్తన) ఆటతాళ చాపు

ప॥ శ్రీలక్ష్మీ-నారసింహ్మా-శీఘ్రమెనను-బ్రోవుమా-శ్రీలక్ష్మీ ॥

అ॥ జాలముసే-యాటమేల-జగతిలోను-యీవేళ-శ్రీలక్ష్మీ॥ (1)

చ॥ భుజగవైరీ-వాహనా-బుధ జనా-హృత్సదనా-అజ-హరాదివం-
దనా-అమృతాంబు-ధి శయనా॥శ్రీలక్ష్మి॥ (2)

అఖిలము- వనాధారా-అరవింద - పత్ర-నేత్రా - యికనిను నే-
విడువ రా-యీశ్వరా-యిక-తాళ రా ॥శ్రీలక్ష్మి ॥ (3)

కుటిలదైత్య వినాశ-ఘటికా-చలనివా- సా-యిటుశోధిం-
చితే శ్రీశా-యెటు-లోకను-ప్రా- దేశా॥ శ్రీలక్ష్మి॥ (4)

తామస-మేలపుష్పాల-రామదాస-పరిపాల-సామగానలోలమే
ల-స్వామి నేయా-శ్రమ తాళ ॥శ్రీలక్ష్మి॥ (5)

కం॥ సురు లసుర బాధ కోర్వక పరితాపము జెంది వేదపఠముతోడ॥
నరశింహా కృతి నెత్తిన-వరదా పుష్పాలరామ-వైభవనామా॥

రాగం వరహాంగి (కీర్తన) ఆదితాళం.

ప॥ రారా శ్రీ-నారశిహ్మా-రక్షించ-నిటు-రారా శ్రీ నారశిహ్మా

అ॥ మారా-కోటి-సుక-మారా-మా రకమణి-హారా - మరాచుట-
మేరా-యిటు-రారా శ్రీ॥ నారశిహ్మా ॥ (1)

చ॥ కరి-ప్రహ్లా-దుల-మొఱ-క్రన్నన-విన్నట్టి-ధీర-తరుణమిదేర-ధీర
తల్లడిల్లెద-నీధర॥ రారా శ్రీ-నారశిహ్మా ॥ (2)

ఉక్కు-కంభ-మునబుట్టి - యుగ్రుడై - ఆక్క-సుబట్టిడొక్క-ను-జీ
ల్చినయట్టి-ధీర-బ్రోవ-జగ-ద్ఘట్టి॥ రారా శ్రీ॥ (3)

అఖిల-భువనాధార-అరవింద-పత్ర - నేత్ర-యిక - జాగుసేయ-
మేర-యీశ్వరా నే-తాళలేను॥రారా శ్రీ ॥ (4)

ఫాలలోచన-వినుత-పద్మసంభ-వార్చిత-యేలవనా-తలవాత -
కేమి శేతు-భువిమీద॥ రారా శ్రీ ॥ (5)

పక్షిగమన-శ్రీలోల-పరమ-దయాళ-యిల-రక్షింపు - కుంటే నే
తాళ-రక్షక-నీవు-యీవేళ॥ రారా శ్రీ ॥ (6)

పరమ-భక్త-జీవన-పంకజ-దళ-నయన - మొఱవినుమి-క్రన్నన-
మోక్షదాయక-బిరాన॥రారా శ్రీ ॥ (7)

తామసింపక-పుష్పాల-రామదాస-పరిపాల-సామగాన-లోల-
మేల-స్వామి-దయతో-యీవేళ॥ రారా శ్రీ ॥ (8)

క॥ మునుధ్రువ-ప్రహ్లాదాదుల-వనటలబో-గొట్టిగావవాయటునిన్నుః
న్నినునమ్మువాని గావవె మునినుత పు-ష్పాలరామ మోహన నామా॥

మాయామాళవగౌళ (ఆదింగు) యేకతాళం.

ప॥ శ్రీలక్ష్మి-నారశిహ్మా-నను ॥

అ॥ శీఘ్రమె-బ్రోవనురక్షా-నను-శీఘ్రమె-బ్రోవను-రక్షా-నను శీఘ్రమె
బ్రోవను-రక్షాఓ॥ శ్రీలక్ష్మినారసిహ్మా॥ (1)

చ॥ దాసపోషకుడని-వింటి-నిను-దోసిలొగ్గి-శరణంటీ-నిను-దోసిలొగ్గి
శర-ణంటీ-నిను-దోసిలొగ్గి-శరణంటీ-వో-శ్రీలక్ష్మి ॥ (2)

మరకత-మణిమయ-భూషానను-మరువకు-మంజుళభాషా-నను-మరు
వకు-మంజుళభాషా-నను-మరువకు-మంజుళభాషా-వో॥ శ్రీలక్ష్మి॥ (3)

సరసీరుహ-ధళ-నయనా-నీ-సరివేల్పు నేయిలగానా-నీ- సరివేల్పునె
యిలగానా-నీ-సరివేల్పునె-యిల-గానా-ఓ-శ్రీలక్ష్మి ॥ (4)

బౌరింగుపేటనీవాసా-నాదు-భయము బాపుభక్తపోషా-నాదు-భయ
ము-బాపు-భక్తపోషా,నాదు-భయము బాపు-భక్తపోషా ॥ (5)

జాలము-జేసుట-మేలా-పు-ష్పాలరామదాస-పాలా- పుష్పాల-రా
మదాస-పాలా-పు-ష్పాల-రామదాస-పాలా. ఓ-శ్రీలక్ష్మి ॥ (6)

# వెంకటేశ్వరతారావళి.

(మత్తకోకిలలు)

1, వేంకటాచలనాథ-మాపతి-వేద-వేద్య-దయానిధే ।
పంకజాక్షసు-రేశ-శంకర-పాపశాపవిమోచనా।
సంకటంబుల-దీర్చిబోవుము-స్వామినిన్శరణంటినే ।
నింక-నెవ్వరి-వేడబోదును-నేమిసేయుదు-దీనుడ ॥

భావమందున-నీవెదిక్కని-పట్టితిని-చరణంబులన్ ।
శ్రీవరా నను-గావనిప్పుడె-జెప్పుమా యొక-మార్గమున్ ॥

9 మార్గమెల్లను-అర్థపంచక-మందుదెల్పిరి-వందుస ।
స్వర్గదౌగురు-నాశ్రయించుక-మచ్చరాదులు-మానిదు ।
ర్మార్గకృత్యము-మానియుండుట-మంచిదంటివి ద్రవ్యసం ।
సర్గమీగతి-గానకుండిన-సాధ్యమెట్లగు-జెప్పుమా ॥

10. చెప్పచుంటిద-నీతిమార్గము-చిల్కపల్కులబోలెనే ।
నొప్పగానొక-కార్యమైనను-దుష్కృతిని-జేయనా ।
కప్పమైనను-లేక-నెత్తిన-నర్థజన్మము-నింకమా ।
యప్ప-నేరము-లెంతసేకన్నను-నాదరింపుము-మ్రొక్కెదన్ ॥

11. మ్రొక్కినాడని-వాయసాసురు-మున్ను బ్రోచితి-వట్లనా ।
పెక్కుదోసము-లెంచకన్ బలు-ప్రేమతో సిరు-లిచ్చినీ ।
ప్రక్కజేర్చక-నేలుకోనను-పార్థసారధి-నేనువే ।
లొక్కరిన్ బతి-మాలనోపను-నుర్వినన్ గల-వారలన్ ॥

12. వారురక్షకు-లంచు-వ్యర్థుల-పద్దనమ్మిక-లుంచివే ।
మారు-గానుగ-జుట్టునెద్దుల-మాడ్కి-నాయువు-పొట్టకై ।
యూరుజుట్టుట-లందువోయెను-నుండుకాలము-లోననిన్ ।
జేయుకార్యము-సేయకున్నను-ఛీ-ఛీ-యందురు-సజ్జనుల్ ॥

13. సజ్జనావళి-భక్తితో నిను-సర్వదాభజి-యింపుచున్ ।
నిజ్జగంబున-మోదమొందక-హీనవుక్కది-పంతలో ।
లజ్జలేకనె-చుట్టకై వడి-లాఘవంబును-జెందినే ।
బొజ్జకార్యమె-గొప్పగాగొని-ప్రొద్దు-బుచ్చుచు-నుంటివన్ ॥

14. ఉండుకాలము-లోనె-చేతికిమాత్రకైకొను-ముందుగా ।
కొండమోసిన-వేద-వేద్యుని-కూర్మిగొల్వని-పాపిగా ।
నుండ-నుందుమ-టంచు-శ్రీశ్రీ-నోపులాతెరు -వాయెమొర్రిన్ ।
ఖండితంబుగ-నానతిచ్చిరి కర్గనాకతి-భీతియున్ ॥

15. భతినొందిన-గోపబాలుర-ప్రీతిగాచితి-నట్లప్ర ।
ఖ్యాతిగానను-బ్రోవు వేగమె-కామితార్థము-లిచ్చియా ।
లేతప్రాయము-నందె లేమిడి-లేకయుండగ-జేయుమా ।
పూతకీమద-భంజనా-పరి-పూర్ణడౌపురు-షోత్తమా ॥

16. ఉత్త-మోత్తము-లైన-భక్తులు-యుర్విలోనిను-బాడుచున్ ।
నృత్యమాడిప్ర-వర్తి సేయుచు-నొప్పె-సజ్జన-గోష్ఠిలో ।
సత్తులనగని-సంతసంబున-సాగిమ్రొక్కక-విత్తసం ।
సత్తిచేనతి-మత్తులౌకదు-పాపులనగన-బోయెదన్ ॥

17. పోయె-మానము-గౌరవంబును-బోయె-లాభము-లేకగం ।
జాయిద్రాగిన-వెఱ్ఱికైవడి-సంచరింపుచు-గాలమున్ ।
బోయె-కుంకుమ-మోతమోసిన-ఖారిగార్ధభ-రీతియ ।
గ్లాయ-నాగతి-జాగుసేయక-నాదరించుము-శ్రీహరీ ॥

18. శ్రీహరీయని-కృష్ణ-వేడగ-చేలముల్ దయ-చేసితౌ ।
పాహి-యీశ్వర-వేగరమ్మన-బారివచ్చిగ-జేంద్రునిన్ ।
సాహసంబున-గాచియేలిన-సత్యమూర్తిద-యానిధే ।
మోహసాగర-మందు-మున్గెడి-మానుపై దయ-యుంచుమా ॥

19. ఉంచు-మించుక-నైన-నీయెద-నుంచి-నాపరి-తాపము ।
ద్రెంచి-కామిత-మిచ్చి-బంటుగ-నేలుకొమ్మద-మాధమున్ ।
వంచనాత్ముల-పంత్సజేరక-వస్తువిమ్మని-వేడకన్ ।
మించు-సంపద-లిచ్చి-నాకొక-మేలుసేయుము-శ్రీపతీ ॥

20. శ్రీపతీయని-యాకుచేలుడు-చెంతజేరిన-యంతలో ।
భూపవర్యుని-గాగజేసిన-పుణ్యమూర్తివ-టంచునిన్ ।
రేపు మాపును-వేడుచుంటిడీ-రీతిజూచియు-నీవుపై ।
చూపు-జూచిన-యార్తతతికిని-జుట్టమని-బుధులందురా ॥

21. అందు-నిందని-లేక-యెందును-నన్నిటంవగ-నిండినీ ।
ఉందువంచు-హిరణ్యసూనుడు-నొప్పగాబ్రక-టించెన ।

ట్లైందు-విగ్రహ-రూపమైతివి-యీశ్వరానిను-గొల్చువా ।
రందనిఁ గరు-ణించి-నన్నిటు-లారడించుట-ధర్మమా ॥

22. ధర్మకర్తవు-ధర్మ-భర్తవు-ధర్మ-మూర్తివి-నీవస ।
ధర్మశీలుడ-వంచు-భాగవ-తంబునందున-శ్రీశుకుల్ ।
మర్మమంతయు-దెల్పినారిల-మానవాధము-లకును నై ।
పేర్మి నాదగు-పాపపుంజము-బేర్చు లేకను-బాపుమా ॥

23. ఈయిలఁ నిను-గొల్చువారల-కేమికష్టము-లిచ్చినఁ ।
శ్రీయుతుండవు-నీవెరక్షణ-సేయుచుందువ-టంద్రుసనీ ।
వేయుపాయమ-పేయమౌదని-వేదవేత్తలు-దెల్పిరా ।
న్యాయముఁ గొని-నీకుదాసుడ-నైతి-సత్యము-కేశవా ॥

24. కేశవుండవు-యండకోట్లను-కేళిగాసృజియించిన ।
శ్రేశుడై పరి-రక్ష-చేసెడి-విశ్వరూపుడ-వీవనిఁ ।
లేశమాత్రము-సంశయంబును-లేకనిఁ-విసుతించెదఁ ।
శ్రీశ-చింతల-దీర్చుమాకృప-జేసిన-న్నిక-నేలుమా ॥

25. యేలుకోకరు-ణానిధీనను-నేమితప్పులు జేసినఁ ।
బాలుడఁ మొఱ-బెట్టు చుండెద-భక్తవత్సలుడైననీ ।
వేల-యీగతి-నూరకుండెదొ-నేమివేసుకె-జూచెదో ।
చాలు-నేనిక-తాళజాలను-జాలినొందితి-లేమిచేఁ ॥

26. లేమిచేతను-బాధనొందుచు-లేలిహాన-శయానవిఁ ।
వేమరుందగ-వేడుకున్న.నీ-విన్యజూపద-వయ్యయో ।
ప్రేమతోనను-గాపకున్నను-పెద్దలందగ-బిల్చినే ।
నేమినేరము-జేశితంచును-నీచ్చెదఁ సభ-లోపలఁ ॥

27. లోకటన్నిను-నీడ్చి-నిల్పగ-లోకమాతగు-లక్ష్మియుఁ ।
రాపు చేయగ నేల-నేనిను-రక్షజేయుదు-నంచనుఁ ।
యోపినంతయు పాయ-మివ్వదు-యోజచేయగ-చిక్కెరో ।
శ్రీపతేయిక-తాలు-నైనను-చిత్తముంచుము-నాపయిఁ ॥

అ॥ మీరి-వచ్చినావన్న-మేరగాదు-తీరుగాదు-త్రాలికి-నీవాదూ - పేడ
నీళ్లు-త్సల్లుదు-రికి మీద్యూ-పాలు- మాలిటు - రారాదూ॥ పారి॥
పో-పో-పో-పో-పాపి-నిదురా॥ (1)

చ॥ కాలక్షేపమునందు-కండ్లు-మూసేపు-పచ్చి-కఠినము-నీకేలా- కుటి
లత-లనుత్రాలా-పటుతరముగ॥ పారి॥ పో-పో - పో - పో॥
పాపి-నిదురా-పాపి-నిదురా॥ (2)

త్యాకరించి-మూశేరు-ఘన-భక్తు-లైనవాడు-జోకతో- నున్న తీరూ-
జేశేవు-కారు-బారూ-సభవార్-నవ్వేరూ-పారి॥ పో-పో-పో-
పో-పాపి-నిదురా-పాపినిదురా॥ (3)

భగవద్గుణములెల్ల-పొగడుచున్న-చోటుల- తగవగునా-రానూ -
మొగమిటు-జూపకనూ-యిగిలించుచునూ-పారి-పో- పో-పో-
నిదురా-పాపి-నిదురా ॥ (4)

అఖిల-భక్త-జనులు-ఆనందముతో జేరి-హరితధ-విమచుండా-ముతి
యుచు-వచ్చి-నిండా-త్వరపడెదవె-నుండా-పారి-పో-పో-పో-
పో-పారి-నిదురా-పాపి-నిదురా ॥ (5)

భద్రా-పతినిగొల్చి-భక్తులు-వేడగ-నిల్చి-తుద్రము-జేశేవా-హద్దు
న-వుండలేవా-మర్ధితురు-త్రావా-పారి- పో-పో-పో-పోపాపి-
పో-పాపినిదురా-పాపి-నిదురా॥ (6)

కాలక్షేప తిల్-వందు- కణ్ గ్ళై-మత్రెక్కింద్రాయ్- కాణామల్-
పోనాలే-కాఘ్కరో మొగుకాలే-వర-వెండా-మిని-మేలే-ఛీ-ఛీ-
పో-పో-పో-పో-పాపినిదురా॥ పాపినిదురా॥ (7)

మూదేవి-యాకె-బందె-మురహారి - భబనెయల్లి - మరియాదయల్ల
కేళూసరియాగెడుంటె-హేళూ-ముతివె-విన్న-కొఅళు-పాగి-
పో-పో-పో-పో-పాపి-నిదురా-పాపి-సిదురా ॥ (8)

సైతాక్నీంద్-ఆయ్-కాయ్కు-సామిథ్యాక్-కర్నే -జాయ్కు-జల్దీ-
సైగెతో-దేవుంగే-దోలాతో-పిర్కు-దేఖేతో -బేమాక్-పో-
పో-పో-పో-పాపి-నిదురా-పాపి-నిదురా॥ (9)

పుష్పాల-రామదాసు-బుధజను-లతో-గూడి-భుజగ-శయను-వేడి
పుణ్యులు,వినపాడీ-వుండగ-నీదాక్షీ-యాలా॥ పో-పో-పో-పో-
పాపి,నిదురా॥ పాపి-నిదురా॥ (10)

కం॥ రామా-వేగమెరమ్మీ స్వామీ భక్తుడను బ్రోవ।
సంశయమేమీ పామరుడను నన్గావను రమ్మీ।
పుష్పాలరామ రంజితనాపమా॥

(కీర్తన) బిలహరి రాగం - ఆదితాళం

ప॥ రామా వేగమె-యిటురమ్మీ-ముద్దు-మోమైనా-జూ-పవదేమీ।

అ॥ తా-మా-సా-మే-ల-ను-స్వామీ-ప్రే-మా-తో-నను-బ్రోవుమీ
అతి-ప్రేమాతోనను-బ్రోవుమీ॥ శ్రీ॥ రామా॥ (1)

చ॥ దశరథ-మహారా-జా-తనయా-యీ-దిశలెల్ల-పొగడగ-నేలవ
య్యా। యీ-దిశలెల్ల-పొగడగ-నేలవయ్యా-దశముఖ-ఖం
డన-రామయ్యా-నాపశమూనిను-బొగడుటకయ్యా-నావశ
మానిను-బొగడుట-కయ్యా॥ శ్రీ-రా॥ (2)

ఇదిసమయమునన్ను-గావానూ-నా-మదిశోధింపకుమునీ-వికా
నూ-నా-మదిశోధింపకుమునీ-విక్రానూ-మదనజనకనా-మని
వివినూ నిను-వదలను-యెవరు-జెప్పినానూ-నిను-వదలను-
యెవరు-జెప్పినానూ శ్రీ॥రా॥ (3)

ఏలనాపై-యింత-కోపమూ-భక్త-పాల-పాపిని-కృప - జూడు
మూ-భక్త-పాల-పాపిని-కృప-జూడుమూ-పు-ష్పాల-రా
మదాసుని-నేలుము-వో-నీలవర్ణ-నీరూపు-జూపుమూ-వో
నీలవర్ణ-నీరూపు-జూపుము॥ శ్రీరామా॥ (4)



శా॥ ఓగోపాలక-నాదుకష్టములునీ-కొప్పించితి-న్బల్కి-ఱుగ ।
బాగోనీకును-పాఃపోతివాయిదే-భారంబటంచున్నది ।
న్నాగోడే-తగులబ్బమీ-యికరమానాథాన-న్నిడెర్చనీ ।
భూగోళంబున-లేరునిన్ను-వినమో-పుష్పాలరామప్రభో ॥

సుజనజీవనం సుగుణభూషణం అనుయాకీర్తన వర్ణమట్టుగా.

కమాసురాగం (కీర్తన, రూపకం తాళం.

ప॥ ఇక నే-తాళసూ-యీబాధ-కిక నే-తాళసూ-వోయీశ్వరా-నీవాడ
నూ-నేను-ఇక నే-తాళనూ ।

అ॥ సుక-శౌనకాగి-స్తోత్రపాదా-పరి-శోదింపకుము నే-శోషిం
చితినీ॥ ఇక నే॥ (1)

చ॥ దాసదుఃఖ-నాశా-నాదు-దోసమెంచకు-శ్రీశా-సర్వేశా-దాసదుఃఖ
నాశా-వాస-దాసులకు-దాసుడైనట్టినన్-గాశిబెట్టిక-గావుము
యీవేళ॥ ఇక నే । (2)

తామసించమేలా-నే-తాళగజాలా-గోపాల-తామసించ-మేలా
భూమిని-నిక-బుట్టి-గట్టగజాల-స్వామివాడెల-సద్భక్తపాలమే
లా॥ ఇక నే॥ (3)

కం॥ నాభాగ్యరాశినీవని నీపాదము బట్టినాను ।
నిజముగ యవనిఁ గాపాడ సమయమిది ప్రతాపా ।
పుష్పాలరామ తారకనామా ॥

హరికాంభోది - (కీర్తన) ఏకతాళం.

ప॥ నారాయణయని-స్మరియించనియా-నాలుక-యుండేలా-స్మరించని-
నాలుకయుండేలా-మన॥

అ॥ కారుణ్యమూర్తిని-ప్రేమతో జూడని-కన్నులురెండేలా-జూడని-
కన్నులు-యుండేలా-శ్రీమ-న్నారాయణ॥ (1)

చ॥ కనకాంబరుదివ్య-కథలు-విననియా-కర్ణముల్ రెండేలా-విననియా-
కర్ణముల్-యుండేలా-మిగుల - కనికరముతో శ్రీ - హరినిపూజిం
చని-కరములురెండేలా-పూజించని-కరములు -యుండేలా - శ్రీ
మన్-నారాయణ ॥ (2)

కరివరదునికో వెలకును-నడువని-కాళ్లును-రెండేలా-నడువని కాళ్లుం
డియు నేలా-శ్రీ-హరిచరణములకు-శరణని-వంగని-శిరమదియుం
డేలా-వంగని-శిరమదియుండేలా-శ్రీమ-న్నారాయణ॥ (3)

నలినాక్షుని శ్రీ-తులసౌ ఘ్రాణించని-నాశికయుండేలా-గ్రహించని-నా
శిక-యుండేలా-యిల-సలలితముగహరి-భక్తులగూడని-జన్మంబ
దియేలా-గూడని-జన్మం-బదియేలా-శ్రీమ-న్నారాయణ॥ (4)

మరువక-శ్రీహరి-చరితలు-దలువని - మానసమదియేలా - దలువని-
మానసమదియేలా-యీ-ధరను - పుష్పాలరామ-దాసులవలె-
హరి దలువనినరుడేలా-హరిని-దలువని-నరుడేలా - శ్రీమ-న్నా
రాయణ ॥ (5)

రాగం ఝ్యాగ్ (కీర్తన) ఆది.

ప॥ నన్ను బ్రోవనుంచి-సమయముసీ-పన్నగ-శయనా-ఓ-పన్నగ-శయనా

అ॥ మున్ను నేనుల-గాచినరీతిగ-నన్ను నీవు వేల-వలెను-లేక-నిన్ను నే-వి
డువ-నికను-అన్నానుగను। నన్ను॥ (1)

శా॥ ధర్మంబేయది విఠ్ఠలా ధరణిలో దైవంబు నీవేయిక౯ ।
మర్మంబెంచిన నీడ్చి నట్టి రెదుట౯ మానంబుదీతు౯ సుమీ ।
కర్మాత్ముండనక౯ కటాక్షమిడినక౯ గాపాడి తేనీకుసం ।
పూర్ణఖ్యాతి వహింత్సగల్గు-వినుమో పుష్పాల రామప్రభో ॥

శంకరాభరణము (కీర్తన) ఆది.

ప॥ హరినామామృత-పానమె-జీవన-మనుచును-చౌక్ చౌక్ చౌక్ ॥
అ॥ కరివరదునిపద-సేవలు-సేయని ఖలులను-ధిగ్ ధిగ్ ధిగ్ ॥ శ్రీహరి॥ (1)
చ॥ నారదాదిముని-నాదుడెగతియని-నగుచును-చౌక్ చౌక్ చౌక్-వా
రిజాక్షునకు-వందన-మిడలేని-వారల-ధిగ్ ధిగ్ ధిగ్ ॥ శ్రీహరి॥ (2)
సాధుసమూహము-సరవితో గూడుక-సతతము-చౌక్ చౌక్ చౌక్-
మోదముతో మదు-సూదను పొగడని-మూఢుల-ధిగ్-ధిగ్-ధిగ్
శ్రీహరి ॥ (3)
మందరధరుడే-మమ్ము-బ్రోచునని-మనమున - చౌక్-చౌక్-చౌక్-
అంధకులై-హరి-నామము-తెలువని-యధముల- ధిగ్ ధిగ్ ధిగ్-
శ్రీహరి ॥ (4)
కామజనకుడే-ఆధారంబని-భూమిని-చౌక్-చౌక్-చౌక్-కామము
తో పర-భామలగూడెడు-వారల-ధిగ్-ధిగ్ ధిగ్॥ శ్రీహరి ॥ (5)
వేమరుపుష్పాల-రామదాసులగూడి-వేడుక-చౌక్ - చౌక్-చౌక్-
ఆమికతో రఘు-రాముని-దలువని-యధముల-ధిగ్-ధిగ్ - ధిగ్-
శ్రీహరి । ( )

శా॥ సామాన్యంబిదె-విఠ్ఠలా-సతతముగ౯-సద్భక్తుడౌ-నామదేవ్ ।
ధీమంతుల్ నిను-రాతిరూపమమర-న్చేసుంచగా-నన్నము౯ ।
బ్రేమన్నిన్ను-భుజింపవేడుకొనగా-పుణ్యాత్మ రైకొంటివే ।
భూమిక౯-భక్త-ప్రియుండవీవె-గదవో-పుష్పాలరామప్రభో ॥

కీ॥ పాలించరా పాండురంగా ఓను యీకీర్తన వర్ణిమట్టుగా.

రాగం-యమునాకల్యాణి (కీర్తన) చాపుతాళం.

ప॥ రాధా-రుక్మిణినాధా-రారా-నేనీ॥
అ॥ పాద-సేవకుడరా-పంతమదేరా-నాతో-పంతమడేరా॥ఓ. రా॥(1)

చ॥ బాధలు-బడలేరా-భక్తమందారా ఓ-భక్తమందారా-శోధించు టమేరా-శోషించినారా-నే-శోషించినారా॥ఓ-రాధా॥ (2)

శామర్మపై నీరూ-తపించుతీరూ-తపించుతీరూ - స్వామియున్నా ర-సం తారించు-ధీరూ-సంతారించుధీరూ॥ ఓ-రాధా॥ (3)

మారకోటిసుకు-మార-శరీరా- సుకు-మార-శరీరా - భారము - బోనరా-బాధకోర్వ్వరా-యీ-బాధకోరార్వా॥ ఓ-రా॥ (4)

సామజపాలా-స్వామిపుష్పాల-నా-స్వామి-పుష్పాల- రామదా సులపాల-రాజస-మేల-యీ-రాజసమేలా॥శ్రీరాధారుక్మిణి నాథా-రారా॥ (5)

క॥ క్రన్నన-శ్రీహరి-బ్రోవను-కన్నడ-సేయకనునీవుప్ర ।
సన్నుడవై రా-కున్ననిను-విడువ-జూడునా ।
యన్నా-పుష్పాలరామ-యద్భుతనామా ॥

రాగం కమాను - (కీర్తన)-ఆదితాళం.

ప॥ కావేరి తీరవాసా-నన్ను-కావవె-రంగేశా-భావాజ-జనకా-నన్ను-పాలించు-భక్తపోషా-నన్ను-పాలించు-భక్తపోషా॥ ఓ-కా॥(1)

చ॥ పన్నగేంద్ర-శయనా-ప్ర-పన్నజనపోషణా-బ్రోవు-మన్నా-ఓ-నీలవర్ణా-నన్నిక-కన్నడ-సేయకన్నా-నన్నిక-కన్నడసేయకన్నా॥ ఓ-కా॥ (2)

ఇద్యేడ-నమ్మితయ్యా యింది-రేశా-యి దేమయ్యా-నా-దుయ్యాలించి వినయ్యా-తాళలే-నయ్య-బ్రోవుమయ్యా-తాళలే-నయ్యా- బ్రోవు మయ్యా॥ ఓ-కా॥ (3)

బమ్మను-గన్నరామా-నా-ప్రార్థనచేకొనుమా-నా ప్రార్థన చేకొను మా-యిటు-రమ్మా-మనవి వినుమ్మా-నన్ను నీ-సొమ్మని-భావించు మా-నన్ను నీసొమ్మని-భావించుమా॥ ఓ-కా॥ (4)

జాలమికనేలా-నే-తాళ-వనమాలా-యికనే - తాళా వనమాలా-పు-ష్పాలరాను-దాసుని-పా-లలించుమి-యీవేళా-పుష్పాల-రామ-దాసునిపాలించుమి - యీవేళా॥ ఓ-కావేరి తీరవాసా॥(5)

శా॥ శ్రీరామా-రమణీమనో-హర-హరీ-శ్రీజానకీవల్లభా ।
ఘోరాఘావన-రక్షణంచకుననున్-గోత్రాస్థలిన్-మంధ్యుడన్ ।
సారా-సార-విచార-ధుర్యతను నే-జాలంగదే నామదిన్ ।
బోరాటంబులు-మాన్పవయ్య-దయతో-పుష్పాల-రామప్రభో॥

సీ॥ తనభర్త-గ్రుహమును-తప్పి పోవుటజూచి ।
పొరుగిండ్లదిరిగెడు-పోలతి యొకతి ।
భర్తగడించిన-పలువస్తుచయము ।
పరపురుషునికిడు-పాపి యొకతి ।
మగడుదా-నిద్రింప-మత్తుపదార్థముల్ ।
తినుపించి-విటుజేరు-జాణ యొకతి ।
తిరునాళ్లకనిపోయి-తిరిగివచ్చెదనంచు ।
తెలివాటుగాండ్రతో-తిరుగునొకతి ॥

గీ॥ మాయలాడులు-యీరీతి-మఱిగి-తిఱిగి ।
పట్టినామాలు-పతినెత్తి-పెట్టి-బెట్టి ।
పుట్టినింటికి-అపకీర్తి-పాసగ జేసి ।
నరకమును-జెందుదురుపూల-రామనామా॥

రాగం-భూపాళము (మేలుకొలుపు) చాపుతాళము.

ప॥ అరుణోదయంబాయె-అమరపక్షులుగూసె-అండజవాహన-లేరా ।

అ॥ పరమపురుషభవ-భంజన-కేశవ-పద్మనాభనిద్రలేరా వేగా-లేరా॥(1)

చ॥ శిలయైన-హల్య-శాపము-దీర్చి-బ్రోచినా-క్షీరసాగరశయనా-లేరా
అలద్రౌపతికక్షయవలు-వలుయిచ్చి-ఆదరించినదేవా-లేరా-
వేగా-లేరా ॥ (2)

గిరివేలనెత్తి-గోవులపాలించిన-గోపికావల్లభ-లేరా-కరికాచి-మక
రిని-ఖండించినట్టిశ్రీ-కరివరదా-మేలుకోరా-వేగా-లేరా॥అరుణోద॥ (3)

దొంగతనముసేయ-ధారవై యున్నావని-దూరెదరందరు-లేరా-
- మంగళారతులెత్త-మరిగాచియున్నారు-మదనగోపాలయిక-లే
రా-వేగా-లేరా॥ (4)

పాలు-పెరుగు -వెన్న - బత్తెన్నముదెచ్చి-పదసేవకున్నారు-లేరా
నీలవేణులగూడి -నీవలసితివేమో నిరుపమాకారయి క- లేరా
వేగా-లేరా॥ (5)

శరణాగత-త్రాణ-బిరుదుపహించిన-సారసాక్ష వేగా- లేరా-నిరతము
నిను-నమ్మినదాసులను బ్రోవ-నీరజాక్ష నిద్ర-లేరా-వేగా-లేరా॥అరు॥

పరమ-భాగవత-ప్రహ్లాదవరులు ప్రార్థింపుచున్నారు-లేరా - నారదాది
మునులు - నియముగ - పాడేరు - నారాయణా - నిద్ర - లేరా-
వేగా-లేరా (7)

సరసిజ - భవనుత- సనకాదివందిత-సాధురక్షక-వేగా-లేరా-ధరలో-
పుష్పాలరామ దాసుని - దరిజేర్చ - దాశరథీనిద్ర - లేరా-వేగా-
లేరా॥అరుణోదయంబాయె॥ (8)

దేవ-దే-వతే-దివ్య-మంగళం॥ అనువర్ణ మట్టు,
దేశ్యతోడి (మంగళం) ఆది.

పండరినాథా-నూరం-పాహిమంగళం.
పుండరీకాక్షా-పూర్ణమంగళం (1)
రాధారుక్మిణీ-నాథా-మంగళం॥
యాదవతిలకా- యనంత-మంగళం॥పం॥ (2)
దీనరక్షకా-దివ్యమంగళం॥
దానవహరణా-దైత్యారి-మంగళం॥ పం॥ (3)
రావణానుజా రక్షాక మంగళం॥
భావజజనకా భవ్యమంగళం॥పం॥ (4)
బాలశ్రీతులసీ వన మాలమంగళ॥
పు-ష్పాలరామదాసా-పాలమాంగళం॥ పం॥ (5)

రాగం-నాథనామక్రియ (మంగళం) ఆదితాళం.

ప॥ పాండురంగ - స్వామినకు- జయమంగళం- పాండవ-పక్షునకు-
శుభ-మంగళం॥ శ్రీ-పాండు॥ (1)

చ॥ అండజ-గమనునకు-అజహరస్తోత్రునకు-పుండరీకాక్షునకు-జయ మంగళం-శ్రీ-భూదేవి-నాథునకు-శుభమంగళం॥శ్రీ-పాండురంగ నాథునకు ॥ (2)

నీలశరీరునకు - నిగమగోచరునకు - బాలకృష్ణునకు-జయ-మంగళం-నిజ-భక్తవత్సలునకు-శుభమంగళం॥ శ్రీ-పాండురంగ-నాథునకు॥

సరసిజనేత్రునకు-సనకాదిస్తోత్రునకు - గరుడ-గమనునకు - జయ మంగళం-అతి-పరమ-దయాళునకు-శుభమంగళం॥శ్రీ-పాండురం గ-నాథునకు-జయమంగళం ॥ (4)

నీలశరీరునకు-నిరుపమగాత్రునకు -బాలకృష్ణునకు- జయ- మంగళం స్వర్ణ-చేలునకును శుభ-మంగళం॥శ్రీ-పాండురంగ ॥ (5)

ధాత్రిలోపు - ప్పాలరామ-దాసపోషునకు - మారకోటి - రూపునకు జయమంగళం-మహాంమేరుసమ ధీరునకు-శుభమంగళం-శ్రీ॥పాం డురంగనాథు ॥ (6)

నీనామ-రూపమునకు నిత్యజయ-మంగళం అను వర్ణమట్టు గా.

సౌరాష్ట్రరాగం - (మంగళం) ఆదితాళం,

ప॥ శ్రీరామ-చంద్రునకునూ-సీతమ్మకునూ-మంగళం

అ॥ మహారాజ-నకు నరుని-మదుసైత్య-మర్దనకునూ-శ్రీరామ ॥ (1)

దశరాథ-పుత్రునకునూ ధశముఖ-శత్రునకునూ॥శ్రీరామ (2)

శశిరావి-నేత్రునకునూ-శ్యామలా-గాత్రునకునూ॥శ్రీరామ॥ (3)

కనకాసు-చేలునకునూ-కరుణాక-టాక్షునకునూ॥ శ్రీరామ॥ (4)

వాలీ-మ-ర్ధానునకునూ-వైకుంఠ-వాసునకునూ॥శ్రీరామ॥ (5)

ధరలో భ-ప్పాలరామ-దాసార-క్షకు-నకునూ॥శ్రీరామ॥ (6)

మంగళం రాగం సురట ఆటతాళ చాపు.

భావజ-జనకుడా-దేవకి-సుతనీకు-మంగళం-జయ-మంగళం సేవజనులబ్రోచు-శేషశయననీకు-మంగళం-శుభ-మంగళం॥ (1)

లాలీమర్కటనాథపాల-సుగుణా-రాజీవ-నేత్రాచ్యుతా ।
భూలోకంబున-నీకులాలి-యిదుగో-పుష్పాలరామప్రభో ॥

(జోజో).

శా॥ జోజోకౌశిక-యాగరక్షణహరీ జోతాటకీమర్దనా ।
జోజోమౌని-మనఃప్రియా-సుగుణహే-జోదీన-సంరక్షకా ।
జోజోగౌతమపత్ని-శాపహరణా-జోవిఠ్ఠలా-మాధవా ।
పూజార్హా-యిదె లాలిజోలలిదిగో-పుష్పాల-రామప్రభో ॥

(పరాకు).

శా॥ నాగారిధ్వజ నారదార్చితపదా-నాకేశస్తుత్యా-పరాక్ ।
యోగీంద్రేశుల-మానసాబ్జ-భ్రమరా-యోభానుతేజా-పరాక్ ।
త్యాగావిఠ్ఠల-ధేనుకాసురహరా-తత్వార్థప్రజ్ఞా-పరాక్ ।
భోగాభాగ్యయుతా-పరాకునిదుగో-పుష్పాల-రామప్రభో ॥

(జోహారు).

శా॥ శ్రీరంగా-మధుసూదనా-మురహరీ-శ్రీరంగని-జోహారుమో ।
క్షీరాబ్ధిన్-శయనించు-దేవతిలకా-శ్రీనాథ-జోహారికిన్ ।
సారాసార-విచారదక్ష-విఠ్ఠలా-సర్వేశ-జోహారుభూ ।
భారంబున్-ఏగదీర్చు వానికిజోహార్-పుష్పాల-రామప్రభో ॥

శ్రీకృష్ణార్పణము.

---

